

## సాహిత్య మాస పత్రిక

# 356


డిసెంబరు, 1988 | సంపుటి : 30, సంచిక 9

వార్షిక చందా : పది రూపాయిలు | విడిప్రతి : ఒక రూపాయి

ప్రకాశకులు :

భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు

# స్వర్ణజయంతి పరిచయ పరీక్ష

## రెండవ పర్యాయం జరుగనున్న పరిచయ పరీక్ష వివరం

1. పరీక్షార్థుల పట్టిక, పరీక్షారుసుము
   అంగీకరించు చివరి తేదీ —ది. 22-12-83.

2. పరిచయ పరీక్ష జరుగుతేదీ —ది. 22 జనవరి 1984 ఆదివారం.

పరిచయ పరీక్ష ది. 20-11-83నాడు ప్రథమ పర్యాయం సుమారు 100 కేంద్రాలలో జరిగినది. హిందీ పండితులు ఉత్సాహంగా ముందుకు వచ్చి పరిచయ పరీక్షను విజయవంతం చేయుటకు పూనుకొన్నారు. వారందరికీ ధన్యవాదాలు.

రెండోసారి జరుగు పరీక్షకు యింకా ఎక్కువ మందికి హిందీ నేర్పి పెద్ద సంఖ్యలో పరీక్షకు కూర్చో పెట్టమని హిందీ పండితులకు మనవి చేస్తున్నాము. వివరాలకు వెంటనే మాకు వ్రాయండి.

చాలామంది హిందీపండితులు పరిచయ పరీక్షారుసుము డ్రాఫ్టుల ద్వారా పంపుచున్నారు. కొంత మంది "కార్యదర్శి, దక్షిణభారత హిందీప్రచారసభ, ఆంధ్ర" అని డ్రాఫ్టులమీద వ్రాయుచున్నారు. దానివలన అసౌకర్యము కలుగుచున్నది. కావున "కార్యదర్శి, స్వర్ణోత్సవ సమితి, ద. భా. హిం. ప్ర. సభ, ఆంధ్ర" అని వ్రాసి పంప కోరుచున్నాము.

హైదరాబాదు
ది. 20-11-1983

వేమూరి రాధాకృష్ణ మూర్తి
కార్యదర్శి

# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక



సంపాదకులు :

**వేమూరి రాధాకృష్ణమూర్తి**

## ఈసంచికలో

సంపాదకీయం :

# హిందీప్రచారం:- నైతిక విలువలు

మహాత్మాగాంధీగారు భారతదేశ సమైక్యతకోసం హిందీభాషా ప్రచారం కావించాలని ప్రకటించి దక్షిణ భారత హిందీ ప్రచార సభను స్థాపించారు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగంగా దక్షిణాదిన జాతీయ భాషాప్రచారానికి రూపకల్పనచేశారు. మాతృభాషా భివృద్ధి, జాతీయభాషాప్రచారం యీరెండింటిని నిర్మాణకార్యక్రమ అంశాల్లో చేర్చారు.

స్వాతంత్ర్యం లభించనంతవరకు జాతీయభాషా ప్రచారంనైతికవిలువలపై ఆధారపడినడిచింది. కాని స్వాతంత్ర్యం లభించిన తరువాత మిగతా అన్నిరంగాల వలెనే జాతీయ భాషాప్రచార రంగంలో కూడ నైతిక విలువలు రోజురోజుకు తగ్గిపోతున్నాయని తెలుపుటకు చింతిస్తున్నాము. స్వార్థం, అవినీతి, అక్రమంగా ధనోపార్జన చేయాలను తహతహాలే ఇందుకు ప్రధాన కారణం.

భారతావని విషయం వదిలి,ఆంధ్రప్రదేశ్ వరకు సీమితమైహిందీ ప్రచార రంగంలో జరుగుతున్న అక్రమాలను గురించి క్లుప్తంగావివరిస్తున్నాము. శ్రీజలగం వెంగళరావుగారు ముఖ్యమంత్రిగాను శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు విద్యాశాఖామాత్యులుగాను వున్నప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హిందీ ప్రచారరంగంలో జరుగుతున్న అవినీతికరమైన చర్యలను అరికట్టేందుకు కృషిచేసింది, కానివారి ప్రభుత్వం పోయిన తరువాత వచ్చిన విద్యామంత్రులు, ముఖ్యమంత్రులు యీ విషయం పట్టించుకోలేదు. అనేక పర్యాయాలు వారిదృష్టికి తీసుకొనివెళ్ళినా ప్రయోజనం లేకపోయింది.

ఇప్పుడు ప్రభుత్వం మారింది. అయినా ప్రభుత్వం గుర్తింపు వున్న కొన్ని హిందీ సంస్థల హిందీపరీక్షల సర్టిఫికెట్ల అమ్మకం బహిరంగంగా జరుగుతున్నది. హిందీలో సంతకమైనా పెట్టలేనివారు పెద్దపెద్ద పట్టాలుపట్టుకొని హిందీట్రైనింగుకు, హిందీ ఉద్యోగాలకు ఎగబడుతున్నారు. లక్షలాది రూపాయల వ్యాపార స్థాయికి యీ వ్యవహారం వెళ్లినట్లు తెలుస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రికగ్నిషన్ వున్న కొన్నిహిందీసంస్థల ఉన్నత పరీక్షలవ్యవస్థవిచిత్రంగా వున్నది. జిల్లా వ్యవస్థాపకులు జిల్లా స్థాయిలో నియమింపబడటం, వారు ప్రభుత్వాన్ని సంతోషపరిచేందుకు కేంద్రాలలో పరీక్షలు నడిపించడం, పరీక్షలు కాగానే ఆ వ్యవస్థాపకులు పరీక్షార్థుల ఉత్తర పుస్తకాలు తీసుకుని వెళ్ళడం జరుగుతున్నది. ఆ పద్ధతిన ఆతరువాత వారుజరిపే పనులు ఎ[illegible]వుంటాయో వూహించవచ్చును.

హిందీ ట్రైనింగు విషయంలో జరుగుతున్న తతంగం యిక్కడ వివరించడం అనవసరమని భావిస్తున్నాము. గుజరాతీ తన మాతృభాషఅయినా, హిందీని జాతీయభాషగా నిర్ణయించి మహాత్ముడు జాతీయభాషా ప్రచార రంగంలో నెలకొల్పిన నైతిక విలువలు రోజురోజుకు తగ్గిపోతున్నాయనే బాధతో యీ విషయం స్రవంతిలో ప్రకటిస్తున్నాము.

హిందీభాషా ప్రచారం అక్రమచర్యలకు, అనైతిక వ్యవహారాలకు సాధనం కాకూడదని కారాదని మా అభిప్రాయం. అందుకే యీ తపన. అందుకే యీ ఆవేదన.

—o—

# శ్రీగిరి శతకము

—డా॥ బాడాల రామయ్య

(వేమన్నను తెలియని తెలుగువాడు లేడు. అటులనే సర్వజ్ఞుని చదువని కన్నడిగుడు కానరాడు. వేమన్నను చదివిన తరువాత సర్వజ్ఞుని చూడపనిలేదు. తెలుగు కన్నడిగులకు గల అవినాభావ సంబంధ మీ యిరువురిచే మనకు స్పష్టము కాగలదు. భావములందే కాదు వారి దేశ కాల పరిస్థితుల ప్రభావములు పరిశీలించిన వారియందు చాలవఱకు సమానాంశము లగుపడుచున్నవి.

సర్వజ్ఞుడే ప్రాంతమువాడో, యెప్పటివాడో, యెవడో అతని జీవనచరిత్ర సమగ్రముగ తెలియక నేటికిని పండితులు సతమత మగుచున్నారు. మన వేమన్న విషయమును ఇంకను యెన్నో పరిశోధించి తేల్చుకొనవలసియున్నది. సర్వజ్ఞుడు త్రిపదుల పాడెను. ఈ త్రిపదులలో మకుటముగ 'సర్వజ్ఞ' అని కొందరు చెప్పుదురు కొందరు 'పరమార్థ' అని దెల్పుచున్నారు. పండితుల యందే భిన్నాభిప్రాయము లున్నవి. కాని యీ త్రిపదుల ఆంధ్రీకరించుచు నేను ఆటవెలదిని వాడితిని. ఆటవెలదితో 'చిదచిదంతరీశ శ్రీగిరీశ' అను మకుట ముపయోగించుకొంటిని. సర్వజ్ఞుని త్రిపదులలోని భావమును ఆటవెలది యందలి మూడుపాదములకు సరిపోవును. త్రిపదిని నాలుగు పాదములుగా పాడవచ్చునని కన్నడ ఆలంకారికు లభిప్రాయపడిరి.

తమిళుల వెణ్బా, కన్నడిగుల త్రిపది, ఆంధ్రుల ఆటవెలది, ఛందస్సున క్రమపరిణామమును పొందినట్లు చెప్పవచ్చును. ఈమూడింటికి మూలము "ఏల" కావచ్చునేమో! ఇదియే ప్రాచీన ద్రావిడఛందోగతియని స్ఫురించుచున్నది. ప్రస్తుత మీపరిశోధనాంశమును వదలి కన్నడిగుల ఇంటింట కవియగు సర్వజ్ఞుని మనమీ "శ్రీగిరి శతకము"న చూడవచ్చును. సర్వజ్ఞుని తెలిగించిన వారులేకపోలేదు. కాని వారిగతివేరు. సర్వజ్ఞుని చదువునప్పుడు మనకు వేమనముందు నిలువగలడు. నిలుచుటయేకాదు వేమనయే సర్వజ్ఞుడైనట్లుదోచును. కర్ణాటాంధ్ర భాషలయందీయిరువురు ప్రజాకవులు పాండిత్యములో కసరత్తుచేసినవారు

కారు. ప్రపంచమునుచూచి, ప్రజలనుచదివి, ఆదేశీయ ఛందస్సున వారిహృదయ ములకు తట్టినట్లు తమఅనుభవమును ప్రకటించిన రసాద్వైతులువారు. ఊరూరు తిరుగుచు దోచినభావముల ఎక్కడికక్కడ నిర్భయముగా దెల్పిరి. సర్వజ్ఞుడు అవధూత అయితే వేమనయోగి సర్వజ్ఞుని త్రిపదితెలుగున వేమనగారిఆటవెలదిగా మారినది. కన్నడిగుల వేమనలో మన సర్వజ్ఞుని చూచుటకీ శ్రీగిరిశతకము కొంత తోడ్పడగలదని భావింతును.)

ఒకడుకాక పలువురుండిరేజగతి? స
ర్వజ్ఞుడొకడె కర్త: భర్త; హర్త
సర్వశాస్త్రదేవ శబ్దవాచ్యుడొకండె
చిదచిదంతరీశ; శ్రీగిరీశ!॥ (1)

రంగురంగుల రుచినింగికెవ్వడుపూసె?
వివిధ వర్ణరాజి నెవడు నెమిలి
కిచ్చె? సుమదళాల కెవడు వన్నెలలమె?
చిదచిదంతరీశ! శ్రీగిరీశ! ॥ (2)

సన్నని యిసుకరవనున్నని శిలలలో
వన్నెపటములందు నున్నవాడు
నీమనంబులోన నిండక యుండునా?
చిదచిదంతరీశ శ్రీగిరీశ! ॥ (3)

పూలలోన తావిపుట్టించెనెవ్వడు?
నారికేళమందు నీరు నింపె
నెవ్వడు? కలకంఠ మెవడుకోకిలకిచ్చె?
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ! ॥ (4)

మట్టిపెళ్ళలందు గట్టి శిలలలోన
ముండ్లకొనల మధ్యమూగు శివుడు
నీవుతలచినకడ నిలువకయుండునా?
చిదచిదంతరీశ శ్రీ గిరీశ! ॥ (5)

ఆపరాత్పరుండు నాత్మరూపంబున
అంబరంబువోలె అడగి యుండె
ఓం క్రియకు ముఖంబు నాకృతి యున్నదే?
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ! ॥ (6)

ఆత్మలోన దేవుడణగియుండియుకూడ
నరుడు చూడలేడు గురుడు లేక
చెట్టులోనినిప్పు చెట్టుకే తెలియదు
చిదచిదంతరీశ శ్రీ గిరీశ ! ॥ (7)

సారమెఱుగకపరచు సద్గురు వెవడైన
నేమి! తెలిసి పొందులేు సుఖంబు
ఊర చేర నెవడు దారి చెప్పిననేమి?
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ! ॥ (8)

గురుని కరుణ యెంతకూడిన వశవర్తి
కాడు, కామియైనవాడు పచ్చి
కట్టెరాచ, నిప్పుకణములుపుట్టునే?
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ! ॥ (9)

మాయగెల్తుననుట మాటలేకానిస
త్యంబుకాదు మాయదవిలి నరుడు
దేహియయ్యె మాయతెగటార్చుటెట్టులో!
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ! ॥ (10)

జడలపెంచవచ్చు మడుగుల నెరికట్టు
వచ్చు; గడులచుట్టవచ్చు; కాని
ఇంద్రియాల నిగ్రహించుట యెట్టులో!
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (11)

జింక తోలుకట్టి చిరునవ్వు నవ్వుచు
కొండపైన నిష్ఠ కూరుచున్న
యోగి మనసుకూడ యువతిపై పోవురా !
చిదచిదంతరీశ! శ్రీ (12)

గుబ్బ లొరయగవళి: కోలుపై బడ వీరు
డెదుటపడ ధనంబు నెత్తుకొనని
ధీరుడెవడో! నుడుల ధీరులే అందరూ !
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (13)

కలికి, గాంచనంబు; గలబండు వృతుంబు
జూచిచూచి మనసు సూరగొనగ
అఱ్ఱుసాచనట్టి అయ్యలుండిరెధర ?
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (14)

ఎఱిగితి ననుమాట యెప్పుడు తప్పొను
ఎఱుగ నెరిగితినని యెదుట బడడు.
ఊరకున్నవాడె నుర్వి సర్వజ్ఞుడు
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (15)

బమ్మనెరిగనేని గుమ్మంబుగా నుండు
బమ్మనెరిగితినని పలికెనేని
దొంగతనముకేగి తుమ్మి చచ్చినటులే ?
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (16)

ఎంత వారలైన నేమి ఫలంబురా ?
తానెవండో ! యన్నతంతు గనుక
జ్ఞాని కాని వాని ఘనతయేమందురా ?
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (17)

సర్వమెఱుగు వాడు గర్వంబుతో కాడు
అఱురఱురంబు నందరియెడ
నేర్చి విద్యయనెడి నిందు పర్వతమయ్యో
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (18)

విద్యయే జననియు విద్యయే జనకుడు
విద్యయే సుబుద్ధి విద్యమార్గ
దర్శి బంధువదియె ధర్మ రాజ్యంబగు
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (19)

ఏటి నీట బడిన యేనుగు వెఱచునే
నీటి చేపలకును? నీచుడాడు
వేడినుడుల కెపుడు వెఱచునే సుజ్ఞాని ?
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (20)

చీకటింట దీపమేకాకృతి నిలిచి
వెలిగి నటుల నవని వెలుగుచుండు
నుత్తమోత్తముడగు యోగీంద్రు డెల్లప్డు
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (21)

ప్రొద్దుపొడుపు లేవొ ! సుద్దియెంగిలియేమొ!
జంకు గొంకు లెటులో ! సరుకు గొనడు
జ్ఞానమనెడి అంజనము దాల్చి ప్రాజ్ఞుండు
చిదచిదంతరీశ ! శ్రీ గిరీశ ! ॥ (22)

నీటిలోన బుట్టు నెరజాతి ముత్యంబు
మరల నీరు కాదు మార్పు చెంది
సత్యమెఱుగువాడు సంసారి కాలేడు
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ ! (23)

జ్ఞానియైనవాడు సంసారియయ్యును
అంటియంటకుండుటరయగలడు
మబ్బుతెరల మధ్య మార్తండుడుండడే?
చిదచిదంతరీశ! శ్రీ గిరీశ! (24)

తెలుగు ప్రొఫెసర్
బెంగుళూరు విశ్వవిద్యాలయం
బెంగుళూరు

# సత్య సందర్శనం

-మానేపల్లి

కొందర్ని కొంతకాలం మోసం చేయవచ్చు
ఎక్కువమందిని కూడా కొంతకాలం మోసంచేయవచ్చు
ఎక్కువ మందిని ఎక్కువకాలం మోసం చేయలేం
-అనేది ఒకనాటి అబ్రహాం లింకన్ సూక్తి
ఈ సూక్తి అతితరచుగా అబద్ధం అవుతూనే వుంది
కావాలంటే చరిత్రపుస్తకాల్లోని రాతలు చూడండి
దేశదేశాల పురాణాల్లోని ప్రచారాలు చూడండి
విజ్ఞానంతోపాటే పెరుగుతున్న మౌఢ్యాన్ని చూడండి
రాచరికం, సామ్రాజ్యం, వలసరాజ్యం
అనే పేర్లు మార్చేసి
ప్రజాస్వామ్యం, సోషలిజం అనేపేర్లు పెట్టారు చూశారా
పెట్టుబడిదారీవర్గాలు తమపాలనకు
పెట్టిన ముద్దు పేర్లవి.
అవిచూసి మినహాయింపు లేకుండా
సంవత్సరాల తరబడి జనం మోసపోయారు
కడకు కమ్యూనిజం కూడా
ఆ పేర్ల వరసలో చేరిపోతుంది
రివిజనిస్టు ప్రభువుల చలవ వల్ల
అందర్నీ అనంతంగా మోసం చేయవచ్చు
అనడానికి ఇంతకంటె నిదర్శనం ఇంకేం కావాలి
ఈ తియ్యని మోసాన్ని
ఛిన్నాభిన్నం చెయ్యనిదే
సత్య సందర్శనం కానేరదు.

—(రచన : 30. 11. 81)
కోటవీధి
చోడవరం
విశాఖ జిల్లా (531036)

# ఏది గొప్ప

కె. స్వర్ణలత

అనంతవిశ్వంలో ప్రతిమహా పదార్థం,
ఒకదానిపై నొకటి ఆధారపడడం యదార్థం
అందేదీ ఒకటికాదు హెచ్చు.
మఱింకోటి కానే కాదులొచ్చు.

నదులుపుట్టుటకు సముద్రం కారణం
సముద్రం నీటికి నదుల సాహచర్యం కారణం.
ఇందొకటి లేక మరియొకటి లేదు.
ఇందేదిచిన్న ! మరింకేది మిన్న?

ప్రాణికోటి ఉత్పత్తిస్థానం స్త్రీ.
ప్రాణికోటి ఉత్పత్తి కారణం పురుషుడు.
స్త్రీ సృష్టి. పురుషుడు స్రష్ట.
ఇందెవరు గొప్ప? మరింకెవరు తక్కువ?

మానవ మనుగడకు ఆధారం ఆత్మ.
ఆత్మ అంతర్మథన అమృతమే పరమాత్మ
పరమాత్మకు ఆశ్రయం ఆత్మ.
ఆత్మకు ఆలంబనం పరమాత్మ.
ఇందేది ఉన్నతం? మఱింకేది మతం?

ప్రపంచం అణు నిర్మితం.
అణువు పరిమాణు పరివేష్టితం.
అణువులేక పరమాణువు లేదు.
పరమాణువు లేక అణువు అసలే లేదు.
ఇందేదీ ఉచ్చం? మఱింకేది నీచం?

ఇసుకఘనీభవించి తయారైందిజూయి. [అన్నిరాళ్ళూకాదనిమనవి]
రాళ్ళు పగిలి తయారైంది ఇసుక.
ఇసుక పుట్టుక జూతినుండా?
జూతిపుట్టుక యిసుక నుండా? ఏది కార్యం? ఏది కారణం?
పగటి అప్పుడు పద్మబాంధవుడు సూర్యుడు.
రాత్రికి వెలుగు కలువల నెచ్చెలి చంద్రుడు.
సూర్యుడు సర్వప్రపంచ సంరక్షకుడు.
చంద్రుడు సర్వఓషధీ ప్రపంచ సంరక్షకుడు.
ఇందెవరిని మేటిగా భావించాలి?
ఎవరినిలోటుగా భావించాలి?
ఒకదానికొకటి సహకరిస్తే కళ్యాణం.
ఒకదానికొకటి వికటిస్తే నిర్యాణం.
సహకార సామర్థ్యం తెలిసిన అన్న.
ఇహలోకంలో దేవునికంటే మిన్న.
ఈ విషయమే నేను కంఠోక్తిగా అంటున్నా.

దొమ్మర నంద్యాల, కడపజిల్లా.

# క్రొత్త ఉదయాలు

—కావూరు పాపయ్యశాస్త్రి

ఈ రక్తారుణ ఉషః సంధ్యా సమయాలు-
ఏ కవి కలం నుండి వెలువడ్డ విప్లవగేయాలు!
ఈ నవవికసిత మందారాలు-
ఏ నవ సమాజ ముఖద్వారాలు!
ఈ దిగంత పరివ్యాప్య శకుంత నిస్వనాలు-
ఏ సమారారంభ వేళా సముద్రిక్త శంఖారావాలు!
ఈ నవోదయ శిశునేత్ర కాంతికిరణాలు-
ఏ నియంతృత్వ శత్రువుపై ఎక్కుడిన బాణాలు!
ఈ తూర్పుకొండ గుండె నుండి
వెలుపడ్డ మార్తాండబింబం-
ఏ మార్పును మోసుకొచ్చిన
తరుణారుణ భావకదంబం!

వల్లవి, చెరుపు మాధవరం, ఖమ్మం జిల్లా.

# మాయమైన పాట

—ఎ. సూర్యప్రకాశ్

పలుకుల చిలక ఎక్కడికో ఎగిరిపోయినపుడు
గొంతు పోతే పోయింది గుండె నిండుగా
ఆరని ఆర్ద్రత వుంది కదా అని సరిపెట్టు
కున్నాము ఆ చిలకను వెతుక్కుంటూ
హృదిలోని హంస కూడా వెళ్ళిపోయినప్పుడు
మూగవోయాము మూర్ఛపోయాము

అపురూప శిల్పాలకు ప్రాణం పోసిన
మూగశిల్పి ఉలి నేలరాలిపోయింది
మెల్లిని వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు
మళ్ళీ మరో మల్లీశ్వరిని
ఎవరు శిల్పించగలరు
శాస్త్రీయగీతం
కృష్ణ శాస్త్రీయగీతం
మళ్ళీ వినే గీత లేదు
కృష్ణ పక్షమే మిగిలింది!

శిల్పి తెలుగుల ఎదలలో
శిల్పమైనాడు
శిల్పిని అనుకరించినవారు
ఏం సాధించగలిగారు
గిరజాలు పెంచడం తప్ప!
గలగలా పారిన
జల ఆగిపోయింది
సజల నయనాలతో చూస్తున్నాము
శిల్పి కన్ను మూసాడు
శిల్పం ఒళ్ళు జలదరించింది
గుండె నీరై పోయింది
శిల్పం కన్నీరై పోయింది

నిత్య నవతావాది
మానవతావాది
స్వేచ్ఛను ప్రేమించినవాడు
కవిత కోసమే బ్రతికినవాడు
సుకుమార పదాల చలువరాళ్ళతో
తాజమహల్ నిర్మించినవాడు
పాటలా గాలిలో తేలి మాయమైపోయాడు!

లెక్చరర్
ఆర్ట్సు & సైన్సు కళాశాల
ఆర్మూరు, నిజామాబాద్ జిల్లా



# మృత్యుసౌఖ్యాలు

-చెన్నోజు రామ్మోహన్

కష్ట నష్టాల కార్చిచ్చులు ఒక్కొక్కటిగా ఆవరించి
అన్ని బ్రతుకు దిక్కులూ అగ్ని దిగ్బంధనం చేసి...
వంచనల వరద గోదారులు చుట్టుముట్టి...
బాధల భూకంపాలకు నేలమట్టమైన ఇళ్లు....ఊళ్లు...
క్రొత్త క్రొత్త చట్ట సభలు వస్తూ
సుఖాల పక్కా హార్మ్యాలు నిర్మిస్తామంటూ
మూడున్నర దీర్ఘ దశాబ్దుల పై చిలుకు
తీపి హామీల తేనె పాటల నీటి మూటలు
వేదికపై విప్పుతూ...వినిపిస్తూ....నడుము ఊపుతూ... చివరికి.
జన కర్ణభేరులు బద్దలై —కంటి పాపలు కారుచీకటై
ఎడదలు ఎడారులై -వర్షించని బీళ్లై-న పరిణామాలు!
—సముద్రుడు ప్రజల అసహనంలా లేచి
ఉవ్వెత్తున ఎగిసి పడుతూ తీరానికి చేరిన
పాశవిక మృత్యు కెరటం క్రింది—
వెన్నంటిన డొక్కలూ కంఠం నిండిన కడుపులూ
కన్నెపిల్లల దరహాసాలూ పూసుకున్న నగరాల
రంగు రంగుల ముఖారవిందాలు-విస్ఫోటమై
జడల గులాబీల రోడ్ల మీద
నల్లని తుమ్మెదల వాహనాలు-స్తంభించి-ప్రేలి
-పీలికలై ముక్కలై వ్రక్కలై గల్లంతై
నీలాలనింగిలో విచ్ఛిన్నమై విడివిడిగా పడిపోయి

చిన్నా పెద్ద నక్షత్రాలై మిల మిల మెరుస్తున్నాయి-
నిరుపేదల పగిలిన అల్ప సంతోషాల
కాంతి పదార్థాలను కోరి కోరి ఏరి తీసి
శ్రేయో రాజ్య బ్రహ్మానందభరిత బ్రహ్మాండాన్ని
మళ్లీ పూర్వంలా పేర్చి-కూర్చి-సమకట్టి
శ్రీ మహావిష్ణువు మెళ్లో పూ మాల చేసి
మనో నేత్రాల కట్టెదుట సుసందర్శనం కావించుకున్నట్లు-
వ్యధల వేదనలో ఆత్మిక సుఖాలు అనుభవిస్తున్నట్లు-
--జనావాసాలపై నిర్దయగా ప్రేల్చబోతూ
అప్పుడే అందిన తాజా ఆదేశానుసారం
మనసు మార్చుకుని ప్రయోగించడం ఆపివేసిన
అణుబాంబులోని బిక్కుబిక్కుమనే శాంతి విశ్వకాంతయై
దిన దిన గండం వెయ్యేళ్ళయుష్షై-చిరంజీవురాలై
ఈ లోకంనుదుటిపై సౌభాగ్య కుంకుమరేఖ భయంకరంగా
పరిఢవిల్లుతోంది.
కరడు గట్టిన సాహసానికి ఆలవాలమైన స్త్రీమూర్తి స్ఫూర్తిలా
ఈ భూమి ఓపికగా ఊపిరిపీల్చుతూ స్పందిస్తోంది—

శ్రీరామకృష్ణ విద్యాలయము
క్రొత్తబజారు,
మహబూబాబాదు-506101
వరంగల్లు జిల్లా.

# కొన్ని చారిత్రక ఏకాంకికలు- పరిశీలన

—ఆలపాటి సుబ్బారావు

"చరిత్ర" అనే పదం మనకు క్రొత్తదికాదు, చరిత్రం, "చరితం" అనుపదాలు పర్యాయపదాలైన ప్పటికి "చరిత" మనే శబ్దం పరమ ప్రాచీన కాలం నుంచీ బహుళ వ్యాప్తిలో ఉంది. ఈపదం కావ్యార్థానికి మిక్కిలి వ్యవహారంలో ఉన్నట్లు హర్షచరిత్రం, ఉత్తరరామచరిత్రం, దశకుమారచరిత్ర, విక్రమార్క చరిత్ర, మొదలైన గ్రంథ కావ్యాల్నిబట్టి స్పష్టమవు తుంది "చరిత్ర" అనుపదం పాశ్చాత్యుల "హిస్టరీ" సమానార్థకంగా ఆధునిక కాలంలో వ్యవహారంలోకి వచ్చింది "సీహిస్టరీ" అను పదం పాశ్చాత్యుల్లో దేశ రాజకీయ చరిత్రమను అర్థం రూఢమైనట్లే. తెలుగులో చరిత్ర పదం రాజకీయ చరిత మనిస్ఫురింపజేయడం గమనించవలసిన విషయం.

చరిత్ర అంటే ఏమిటి? అను విషయాన్ని తెలిసి కోవాలి. వ్యక్తి, చరిత్ర, దేశ చరిత్ర, జంతు చరిత్ర, వస్తు చరిత్ర, సాంఘిక, ఆర్థిక, రాజకీయ చరిత, మత నైతికాధ్యాత్మిక చరిత మొదలైన వాటినిబట్టి చూస్తే ప్రతి వస్తువుకు, వ్యక్తికి, దేశానికి చరిత్ర లున్నాయి అని స్పష్టమౌతుంది. చరిత్ర నిర్వచనా నికి డాక్టర్ వి. సీతాకల్యాణి గారు, ఒక వ్యక్తి యొక్కగాని విషయముయొక్క క్రమ పరిణామగాథా కథనము చరిత్రమగును. అని "నిశ్రేణిక సాహిత్య వ్యాస సంపుటిలో చరిత్ర సాహిత్యములు, సామ్యభేద ములు- పి. 6"లో నిర్వచించారు.

"మానవ సాంఘిక జీవనమునకు సంబంధించిన అన్ని విషయములను కథగాకూర్చి సాగించిన రచనయే చరిత్ర" అని అరిస్టాటిల్ అభిప్రాయ పడ్డాడు.

History of past politics and politics is present history అని feruman అనే చరిత్ర కారుడు, అభిప్రాయ పడ్డాడు

చరిత్ర ఇతివృత్తంగాగల కావ్యాలు మన తెలుగు సాహిత్యంలో చాలా తక్కువ. సంస్కృతంలో బాణుని "హర్షచరిత్ర, కల్హణుని "రాజతరంగిణి" మొదలైన వాటిని పేర్కొనవచ్చు, తెలుగులో సిద్దే శ్వర చరిత్ర కాకతీయుల చరిత్ర ఆంధ్రుల చరిత్ర రామ రాజీయం, రాణాప్రతాప సింహ చరిత్ర మొద లైన వాటిని పేర్కొనవచ్చు. చరిత్రను వ్రాసేవాడు ఒక విధంగాకవే, మైగ్రంథాల్ని నిర్మించిన వాడుకవే కదా; జె యం. డెవల్యాన్స్ అన్నే ప్రముఖ చరిత్ర కారుడుకూడా చరితను వ్రాసేవాడు, ఒక విధంగా కవేనని చెప్పాడు. చరిత్ర వేరు చరిత్ర రచనా కళ వేరు అని ఆధునిక చరిత్రకారుల్లో కొందరి అభి ప్రాయం, యధార్థ విషయాన్ని చెప్పితేనే నిజమైన చరిత అవుతుంది. కవి ఈవిషయాన్ని కథారూపంలో చెబుతూ వర్ణనల్ని ఉపమానాది అలంకారాల్ని జోడించి చరిత్ర రచన చేస్తాడు. కవి వీటన్నింటిని చెప్పకుండా కేవలం రాజుకథనే చెప్పినచో అది మృతకళేబర ప్రాయమే అవుతుంది సత్య విషయాల్ని గ్రహించి వాటికి సాహిత్యశిల్పాల్ని ప్రదర్శించి నిర్మించినవాడే నిజమైన చరిత్ర కళాకారుడు ఇట్టి రచనలే తారా

స్థాయినందుకుంటాయి. చారిత్రక విషయాలతో అనేక సాహిత్య ప్రక్రియలున్నాయి. అట్టివాటిలో ఏకాంకిక ఒకటి ప్రస్తుత వ్యాసంలో కొన్ని చారిత్రక ఏకాంకికల్ని పరిశీలన అనేది ప్రధానాంశం.

నాటక కర్తలు చరిత్రలోని కొందరి వ్యక్తుల్ని ముఖ పాత్రలుగా గ్రహించి ఆయావ్యక్తుల గుణశీలాలు ఆంతరంగిక విషయాలు, కొన్ని సన్నివేశాల్లో నాటకాల్ని నిర్మిస్తారు ఇందులో కవి తాను స్వయంగా కల్పించిన పాత్రల్నూ, గాధలూ ఉంటాయి. అన్నీకల్పిత గాధలనీ, అన్నీకల్పిత పాత్రలనీ భావించరాదు. కొన్ని శతాబ్దాంక్రిందట జరిగిన యుద్ధాన్నిగాని, కధనుగాని కవిదర్శించలేడుకదా వీటినిచరిత్రకారునిద్వారా దేశ చరిత్రద్వారా సందర్శించి ఆయుద్ధంఎలాజరిగిందో, ఆ యుద్ధ రంగ దృశ్యం ఎలా ఉంటుందో, తన మనో దర్పణంతో కవి దర్శించి నాటకాన్ని నిర్మిస్తాడు. తెలుగులో అనేక చారిత్రక నాటకాలున్నాయి. వాటిలో వేదం వారి ప్రతాప రుద్రీయం. కోలాచలం వారి "రామరాజు చరిత్ర శ్రీపాదవారి బొబ్బిలి యుద్ధం" చరిత్ర పానుగంటివారి ప్రవరద చాణక్య! వుప్పవ వారి" నాయకురాలు ముత్తరాజు సుబ్బారావు గారి చంద్రగుప్త నాటకము కొప్పరపువారి "రోష నార" మొదలైన వారి నాటికలు మిక్కిలి ప్రచారం పొందాయి మనకిట్టి ప్రసిద్ధాలయిన నాటకాలు ఉండగా ఏకాంకికలు ఎందుకు అవసరమయ్యాయి: అనే సమస్య మనకు ఎదురౌతుంది, నాటకం జీవితానికి దర్పణం, అని ఒక నిర్వచనం ప్రస్తుత పరిస్థితిలో వాక పూర్తి జీవితాన్ని ప్రదర్శించడానికి రచయితకి అవకాశం తక్కువ అదే విధంగా ప్రేక్షకులకు దర్శించే ఓపిక తక్కువ అదే సమాజ పరిస్థితుల్ని ఆధారంగా చేసుకుని, జీవితంలో ఒక చిన్న భాగాన్ని ఇతివృత్తంగా తీసుకుని కవి రచయిత రచన చేస్తున్నాడు. జీవితాన్ని చరిత్రగా తీసుకుంటే, అందలి పాత్రల్ని. ఘట్టాల్ని చిన్న చిన్న భాగాలుగా తీస్తుకుంటే ఏకాంకిక యొక్క పరిమాణం మనకు అర్థమవుతుంది ఇదంతా చెప్పడానికి గల కారణం ఏకాంకిక చిన్న శరీరాన్ని కలిగి ఉంటుందని చెప్పడం కోసమే ఏకాంకిక నేటి మానవునికి తక్కువ సమయంలో ఎక్కువ ఆనందాన్ని ఇస్తుంది కాబట్టి వీటిని ఎక్కువగా నేడు ఆదరిస్తున్నారు.

నేటి రచయితలు (చారిత్రక ఏకాంకికల్ని)

1 చారిత్రక సత్యమైన విషయాన్ని ఆ ప్రముఖంలో చేసే కల్పిత పాత్రల్ని ప్రముఖంగా చిత్రించడం

2. చారిత్రకంగా సత్యమయిన పాత్రల్ని ప్రధానంగా చేసి మరికొన్ని పాత్రల్ని అప్రధానంగా చేసి మరికొన్ని పాత్రల్ని కల్పించడం.

3. చరిత్ర గతమయినట్టి కాలగర్భాంతర్లీనమైనట్టి, ఇతర పూర్వజ్ఞాన కధల్ని సేకరించి కవిమనో ధర్మాల్ని అనుసరించి కధా కాలంనాటి ప్రజాజీవన సంఘర్షణల్ని చిత్రించడం

4 పాత్రలు చరిత్ర సత్యాలైనను అసత్యాలైనను చరిత్రలోకొన్ని ఉదంతాల్ని ఇతిహాసాల్ని ఆధారం చేసుకుని, ఇతి వృత్తాన్ని దేశకాల పాత్రనుగుణంగా పోషించడంవంటి లక్షణాలతో ఏకాంకికల్ని నిర్మిస్తున్నారు. చరిత్రకు సంబంధించిన సాక్ష్యాన్ని సేకరించి ప్రమాణాల్ని క్రోడీకరించి రచించబడ్డిందే చరిత్రను నిర్ణయించే ఏకాంకిక, ఇటువంటి ఏకాంకికలు మనకు చాలా తక్కువగా ఉన్నాయి.

విశ్వనాధ కవిరాజుగారు దాదాపు 50 ఏకాంకికల్ని వ్రాశారు అందులో చారిత్రక ఏకాంకికలు ఉన్నాయి. తల్లాడ్రి ఆవడ్డాని గార్గ్య శుద్ధభిక్షన, ప్రీష్మా, సుల్తాన్ రజియా, బాలచంద్రుడు, పల్నాటి వీరచరిత్ర, జగ

కృతి, పాకాల వెంకట రాజమన్నారు, నాగు బాము, ముద్దుకృష్ణగారు, అనార్కలి, బుచ్చిబాబుగారి రాయల కరుణకృత్యం, ఉమర్ ఖయ్యాం, చిత్ర గుప్తులుగారు, ఝాన్సీ లక్ష్మీబాయి, (1928), కొంపెల్ల, జనార్ధనరావుగారు తాన్ సేన్, (1928). నండూరి బంగారమ్మగారి ఖడ్గతిక్కన, శ్రీ తల్లా వఝ్ఝల కృతివాసతీర్థులుగారు సమ్రాట్ అగ్నిమిత్రుడు, జ్ఞానాంబగారి, జహంగీర్ - నూర్జహాన్, సత్యవోలు సుందరరావుగారి రామరాజు, జి. వి. కృష్ణారావుగారి తమ్మపడిగ, అంగర సూర్యారావుగారి తంతియాతోపే. కొప్పరపు సుబ్బారావుగారి చేసినపాపం, ఉన్నవ లక్ష్మీనారాయణగారి హరిజన నాటకం అట్లూరి వెంకటకృష్ణయ్యగారి, మదిరాదేవి, శ్రీ పాద సుబ్ర మణ్యశాస్త్రిగారి కలంపోటు, గణపతిరాజు అచ్యుత రామరాజుగారి ఖడ్గతిక్కన' ఎస్. వి. జోగారావుగారి ఛత్రపతి, పాపారాయుడు, మొదలైన వాటిని పేర్కొనవచ్చు. ఇంకా చక్కని కళాత్మకమైన ఏకాంకిక లున్నాయి. వాటినన్నింటిని పేర్కొనడం కష్టసాధ్యమైన పని.

పై ఏకాంకికల్లో వీర, కరుణ, హాస్యరసాదులేగాక రాజుల ఆస్థానాల్లో కవులు తమ పాత్రల్ని ఏవిధంగా నిర్వహించారు. అనే విషయాలలో నిర్మించబడ్డ ఏకాంకికలూ ఉన్నాయి. అంతేగాక సంఘ సంస్కర ణార్థం రచించబడ్డ ఏకాంకికలు కూడా ఉన్నాయి

మొట్టమొదట వీర రస ప్రధానమైన ఏకాంకికల్ని చర్చిద్దాం! మల్లాది అవధాని గారి "బాలచంద్రుడు"లో బాలచంద్రుడు యుద్ధంలో తన వీరత్వాన్ని ప్రదర్శించి ఏ విధంగా వీరస్వర్గం పొందింది ఇందలి ప్రధా నాంశం. ఈ ఏకాంకికలో పాఠకులు కొంచెం తన్మ యత్వం చెందడానికి చక్కటి సంఘటల్ని కల్పించారు. ఏకాంకిక చివరి రంగంలో ఐతాంబ, మాంచాల మల్లె దండలు గుచ్చుతూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు అప్పటికే బాలచంద్రుడు యుద్ధంలో మర ణిస్తాడు. ఈ మరణం పాఠకులకు (ప్రేక్షకులకు) తెలయడానికని మాంచాల చేతిలోని మల్లెదండ తెగి నేల జారడాన్ని, మాంచాల "చంద్రోదయం అయింది" అంటే ఐతాంబ "బాల చంద్రుడు ఆకాశంలో ఉదయిం చాడు" అంటుంది.

జగజ్యోతి, పల్నాటి వీర చరిత్ర, ఖడ్గ తిక్కన వంటి ఏకాంకికలు ప్రధానంగా యుద్ధ ఏకాంకికలు. దేశం కోసం అవసరమయితే తమ ప్రాణాల్ని పణంగా పెట్టాలని ధ్వనింపజేయడమే వీటి ధ్వన్యాత్మకమైన సందేశం

అచ్యుత రామరాజు గారి "ఖడ్గతిక్కన"లో తిక్క నకు సేన సరిపడనందువల్ల యుద్ధం నుంచి తిరిగి వస్తే తిక్కన తండ్రి "లే వెళ్ళు కళంకిత హృద యాలకూ, ధర్మదూషణ తత్పరులకూ, దేశద్రోహు లకూ నాయింట చోటు లేదు. వెళ్ళిపో" అనీ, "మంచం మాటున మరుగుగా మజ్జనమాడమని" తిక్కన భార్య- "నీ ధైర్యం యిలాగే తిరిగిందిరా" అని విరిగిన పాలు పోసి తిక్కన తల్లీ అవమానిస్తారు. తిక్కన పగరకు వెన్నిచ్చి పరిగెత్తే పిరికిపంద అనే వీరి ఉద్దేశం. వీరి మాటలకు తిక్కన పౌరుషం తెచ్చుకుని ఒంటరిగా పోరాడి వీరమరణం పొందుతాడు.

కొంపెల్ల జనార్ధనరావుగారు "తాన్ సేన్" అనే గాయకుణ్ణి కథకుడిగా చేసుకొని "తాన్ సేన్" అనే ఏకాంకికను నిర్మించారు. తాన్ సేన్ అక్బరు యొక్క ఆస్థాన గాయకుడిగా చేరడం, అక్బరు కోరిన దీప కరాగాన్ని పాడడం, దానివల్ల మంటలతో బాధ పడడం, మీరా "మలహరి"ని ఆలాపించి మంటల్ని తొలగించినందువల్ల ఆమెను ప్రేమించడం, అమె తాన్ సేన్ ప్రేమను తిరస్కరించడం చివరకు ఇద్దరూ సన్యాసులుగా మారడం ఇందలి అంశాలు.

"మానవుడు తన కోరికను తీర్చుకొని స్వార్థంగా జీవించడం కంటే పరమేశ్వరుని సేవకై బ్రతకాలని" ఈ ఏకాంకిక చెబుతుంది. ఈ ఏకాంకికలో తాన్ సేన్ సన్యాసిగా మారే ఘట్టం చాలా రసవత్తరంగా చిత్రించబడింది. కాషాయ వస్త్రాల్ని "వినయ వేషం" అని మీరా పాత్రచే కవి పల్కించడం చాలా ఔచిత్యంగా ఉన్నది.

ఆచార్య యస్. వి. జోగారావుగారి "పాపారాయుడు" అనే ఏకాంకికలో పాపారాయుని యొక్క ప్రభుభక్తిని చక్కగా చిత్రించారు. పాపారాయుని చేతిలో చావడానికి సిద్ధంగానున్న రామరాజు పాపారాయుణ్ణి బొబ్బిలికి రాజుగా చేస్తానంటాడు. "నారాజుని రాజ్యాన్ని లెక్కించుకోలేని నాకు రాజ్యం వద్దు. ఆ రాజ్యానికి రంగారావు దొర కొడుకు వెంకటాయుడే రాజు"అని చాటిన నిస్వార్థత ఇందలి పాపారాయుడు.

ఇక కరుణరస ప్రధానమైన వాటిని గూర్చి తెలుసుకొందాం. ముద్దుకృష్ణగారి "అనార్కలి"లో ప్రేమ కోసం కుమారుడూ, ప్రజాభిప్రాయం కోసం, సామ్రాజ్య క్షేమం కోసం తండ్రీ విషమ పరిస్థితుల్లో పడి ఒక అమాయకురాలి జీవితాన్ని ఏ విధంగా బలి చేసింది చిత్రించబడింది.

ఇందలి పాత్రలు ప్రేమకూ, త్యాగానికీ సజీవ పాత్రలుగా నేటికిని నిలిచిపోయాయి. సలీం ప్రేమను నశింపజేయాలి అని ప్రయత్నించిన అక్బరుతో అబుల్ ఫజల్ తో సలీం-"వజీర్జీ! ప్రేమలేని సామ్రాజ్యమే అక్కరలేదు నాకు" అనీ, అదే విధంగా అనార్కలి ప్రేమను నశింపచేయాలని ప్రయత్నించిన అక్బరుతో అనార్కలి- "వారిని (సలీం) ప్రేమించకుండా ఉండలేను, నేను బ్రతకలేను...నన్ను చంపించి వేయండి" అని పలికింప జేశారు ముద్దుకృష్ణగారు.

పి. వి. రాజమన్నారుగారు బౌద్ధమత వాతావరణంతో "నాగపాము" అనే చక్కటి కరుణరస ప్రాయమైన ఏకాంకికను చిత్రించారు.

నాగసుందరుడనే శిల్పిపాముకాటుతో మూర్ఛపోతాడు. "జయశ్రీ" అనే నాట్యగత్తె శిల్పిని రక్షించి తన ప్రాణాల్ని కోల్పోవడం, శిల్పి బ్రతికి తను కూడ మళ్ళీ మరణించడమే ఇందలి ప్రధానాంశం.

కొప్పరపు సుబ్బారావుగారు "చేసిన పాపం" అనే ఏకాంకికలో కూడా బౌద్ధమత వాతావరణంతో నిర్మించారు ఇందు సిద్ధార్థుని శాంతిమూర్తిగాను, తపశ్శాలిగాను చిత్రించారు. ఇందు మాయాదేవి తను చేసిన పాపం చెబితే పోవునని ఉద్దేశంతో సిద్ధార్థునికి వివరిస్తుంది. "పాపం అని నీకు తోచిన కార్యాన్ని ఇకమీద చెయ్యకు" అని ప్రబోధిస్తాడు సిద్ధార్థుడు.

బుచ్చిబాబుగారు "రాయల కరుణ కృత్యం" అనే ఏకాంకికలో రాయల దయార్ద్ర హృదయాన్ని రాయలు ప్రేమించినటువంటి "స్వరూపిణి"ని.

పై పరిశీలనలోనికి అనేక ఏకాంకికలు వచ్చాయి. కొన్ని దేశభక్తిని బోధించినవైతే, మరికొన్ని ఒక సిద్ధాంతాన్ని ప్రబోధించడానికి రచించబడ్డాయి. వీటిలో ప్రదర్శనకు నోచుకున్నవి కొన్నే అయినప్పటికి రచయితలు సాంఘిక ఏకాంకికల మాదిరిగానే వీటిని కూడా ఏదో ఒక ప్రయోజనం కోసం వ్రాస్తూనే ఉన్నారు.

—o—

తెలుగు శాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
వాల్తేరు - 530 003.

# తెలుగు మీద కన్నడ భాషా ప్రభావం

-ఎ. హనుమంతప్ప

తెలుగు, కన్నడకు దగ్గర సంబంధముందని అటు చారిత్రకంగానూ, భాషాకుటుంబ దృష్టితోనూ, పరిశోధనలు చాలా జరిగాయి. ఆంధ్రప్రదేశ్ పడమటి భాగాన కర్నాటక సరిహద్దు ఉంది. తెలుగువాళ్ళు కర్నాటక రాష్ట్రంతో సాంఘిక, సాంస్కృతిక రాజకీయ సంబంధాలు పూర్వం నుండే కల్గివున్నారు. శ్రీ కృష్ణదేవరాయలు మొ, రాజులు కర్నాటక ప్రాంతమూ తెలుగుభాషా ప్రాంతమైన మన రాష్ట్రంలో కొంత భాగమూ కలిపి ఏకంగానే పాలించారు అందువలన ఉభయ భాషల సమ్మేళనం జరగడానికి ముందునుంచి ఇప్పటివరకు అవకాశముంది. మిగిలిన ప్రదేశాల్లోని వ్యవహారంకంటే కర్నాటక సరిహద్దు ప్రాంతాల్లో[1] మాట్లాడే భాష భిన్నంగా వుంది ఒకవైపు పత్రికలు, సినిమాల, రేడియోల కారణంగా ప్రాంతీయ మాండలిక భాష మారడానికి అవకాశమున్నా పొరుగు రాష్ట్ర భాషా ప్రభావం అంత తొందరగా పోయేది కాదు.

## భాషా సంపర్కం:

సాధారణంగా ఒక భాషకంటే ఎక్కువ భాషలు మాట్లాడేవాళ్ళలో వాళ్ళు మాట్లాడగల్గే అన్ని భాషా ప్రభావాలు సమ్మిళితమై వుంటాయి మన రాష్ట్రానికి కన్నడ సరిహద్దు ప్రాంతాల్లో కన్నడం, తెలుగు రెండూ మాట్లాడేవాళ్ళున్నారు. ఇక్కడ కొన్ని కులాల వారు (ఉదా: జంగమ, కురుబ హరిజన) యింట్లో మాత్రం కన్నడ మాట్లాడి, బయట తెలుగు మాట్లాడతారు. ఇలాంటి వ్యవహర్తల ప్రభావం యితరులపై తప్పకుండా వుంటుంది. ఈ సరిహద్దు ప్రాంతాల్లో వుండేవాళ్ళు కన్నడ మాట్లాడడానికి రాకపోయినప్పటికీ కన్నడను అర్థం చేసుకునేవాళ్ళు సుమారు ఎనభై శాతం వున్నారు తమ మాతృభాష తెలుగే అయినప్పటికీ యించుమించు యాభైశాతం మంది కన్నడ భాష మాట్లాడగలుగుతారు.

## ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాల్లోని సరిహద్దు జిల్లాలు

అనంతపురం, చిత్తూరు, మహబూబ్‌నగర్, జిల్లాలు మన రాష్ట్రానికి సరిహద్దు జిల్లాలుగా గుల్బర్గా బీదర్, బళ్ళారి, రాయచూర్, పావగడ, బాగేపల్లి తుమకూరు కోలారు మొ. ప్రాంతాలు కర్నాటకకు సరిహద్దు ప్రాంతాలుగా వున్నాయి[2]

గుల్బర్గా ప్రాంతంలో వ్యవహరించే కన్నడకు, తుమకూరు ప్రాంతంలో వ్యవహరించే కన్నడకు మాండలికంగా కొద్ది తేడా వుంటుంది అలాంటప్పుడు తప్పనిసరిగా ఆయా మాండలిక భాషాప్రభావం ఆయా మాండలికానికి సరిహద్దులుగా తెలుగు ప్రాంతాలపై వుంటుంది.

1 అనంతపురం, కల్యాణదుర్గం, పావగడ, పెనుగొండ, మడకశిర, కదిరి, ఆదోని, గుంతకల్లు, ఉరవకొండ రాయదుర్గం మొ. పరిసర ప్రాంతాలు

2. ఈ ప్రాంతాలు కర్నాటకలో ఉన్నప్పటికీ అరవై శాతంకంటే ఎక్కువమంది తెలుగు మాట్లాడతారు.

ఇంతవరకు జరిగిన పరిశోధన జరగాల్సింది :

కీ. శే. డా. చిలుకూరి నారాయణరావుగారు అనం తపురం గ్రామ నామాల మీద కన్నడ భాషాప్రభావం గూర్చి పరిశోధన చేశారు.[1] కీ. శే. కల్లూరు నాగ భూషణరావుగారు రాయలసీమ మాండలికం - అనంత పురం ప్రాంతీయత మీద చేశారు. దానిలో కన్నడ ప్రభావం గురించి కొంత చెప్పారు.[2] చేయాల్సింది యింకా చాలా వుంది. రాష్ట్రవ్యాప్తంగా విద్యాబోధన అన్ని స్థాయిల్లోనూ వ్యవహార భాషలోనే జరగడానికి సమగ్ర ఆధునికాంధ్ర భాషా నిఘంటు నిర్మాణం, సమగ్ర ఆంధ్రాభాషా వ్యాకరణం అవసరమవుతాయి. అంచేత ఆంధ్ర రాష్ట్రానికి పడమటి భాగ సరిహద్దు ప్రాంతాల్లో కన్నడ భాషా ప్రభావం గూర్చి పరిశోధన సాగాల్సిన అవసరం వుంది.

సాధారణంగా సరిహద్దు ప్రాంతాల్లో బాగా వెనుక బడినతనం కనిపిస్తుంది. దీనికి కారణం రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు సరిహద్దు పాంతాల్లో ప్రాథ మిక చదువు చదివే విద్యార్థుల్లో చైతన్యవంతం అంతగా కనిపించదు (స్కూలు పిల్లల్లో కూడా) ఎక్కువభాగం స్తబ్ధత వుంటుంది ఈ స్తబ్ధత పోగొట్ట డానికి భాషా సామాజిక చైతన్యం రావాల్సివుంది. భాషా సామాజిక చైతన్యం రావాలంటే విస్తృతమైన పరిశోధనలు సాగాలి.

ఈ వ్యాసకర్త ఆంధ్ర, కర్నాటక రాష్ట్ర సరి హద్దు ప్రాంతాల్లో పర్యటించి చేసిన సర్వేతో బయట పడ్డ విషయాలలో కొన్నిటిని మాత్రం ఈ వ్యాసంలో చూపడం జరిగింది. ఇక్కడి ప్రజల వ్యవహారంలో వినిపించే వివిధ రకాల పదరూపాలను చూద్దాం.

## 1. కొన్ని పదాల్లో వినిపించే విలక్షణోచ్చారణలు

1.1. తాలవ్యాచ్చులతో కలిసినపుడు చ, జ లు తాలవ్యోచ్చారణంతోనూ, కంఠ్యాచ్చులతో కలిసి నపుడు దంతమూలీయోచ్చారణంతోనూ వినిపించడం తెలుగులో సాధారణంగా వుందే సరిహద్దు ప్రాంతాల్లో దంతమూలీయోచ్చారణతో వున్న తెలుగు పదాల్లోని చ, జలు తాలవ్యాచ్చులుగా వినిపిస్తాయి.

ఉదా : చదువు—చదువు/చలి-చెలి (సలి-సెలి అని కూడా వినిపిస్తుంది)

జలెడ —

**1.2.** శ/ల; ణ/న తో కూడిన రూపాలు :

ఉదా : హోళిగ/ఓళిగ/ఓలిగ హ> —

అణ్ణ/అన్న

**1.3.** విలక్షణమైన వర్ణవ్యత్యయాలు :

ఉదా : గెల/గొల

ఎ/ఒ ల వినిమయం ఇక్కడ కన్నడ ప్రభావాన్ని శంకించడానికి వీలుంది. క. గొలె. తెలుగు-గెల

ఇలాగే రెడ్డి/రొడ్డి, రోకలి/ర్యాకలి, ఇసక/ఉసికి/ ఉనుక లాంటి రూపాల్లోని వర్ణవ్యత్యాయాలు కూడా కన్నడ నిర్మాణ ప్రభావం కావచ్చునా అని ఒక సందేహముంది.

1. చూ. ఆంధ్రభాషాచరిత్రము. మొ. సం. (1937) పుటలు. 664-65.

2. చూ. రాయలసీమ మాండలికం—అనంతపురం ప్రాంతీయత (1972) పుటలు 55-65.

## 2 వ్యాకరణాంశాల్లో కనిపించే కొన్ని విశేషాలు:

### 2.1. విభక్తి లోపం :

కన్నడలో సంస్కృత శబ్దాల చివర ఏ ప్రత్యయాలు చేర్చకుండా యథాతథంగా వాడతారు. తెలుగులో సంస్కృత పదాలు వాడేటప్పుడు సంస్కృత శబ్దాల చివర డు,ము, వులు చేర్చుకొని వాడడముంది. కాని కన్నడ ప్రభావం వల్ల సరిహద్దు ప్రాంతాల్లో ఒకొ్క్కక్కప్పుడు ఏ ప్రత్యయాలు చేర్చకుండానే వాడే పద్ధతి అరుదుగా వినిపిస్తుంది.

ఉదా : మజ్జిగన్న (మజ్జిగన్నం అనడానికి)

కూలిమఠ (కూలిమఠం అనడానికి)

నీ సంబళ యెంత ? (నీ సంబళమెంత)

సంబళం = జీతం.

### 2. 2. విలక్షణ సంధి :—

ఒకొ్క్కక్కప్పుడు ఒకే అర్థాన్నిచ్చే రెండు భాషల పదాల్ని కలిపి వ్యవహరించడముంది.

ఉదా :- నీయాకట్ల మేము షావుకార్లు కాదప్పా!
(నీమాదిరి మేము షావుకార్లు కాదనడానికి)

నీ అగ + అట్ల> నీ యాగట్ల> నీ యాకట్ల

కన్నడ. హాగె = వలె, మాదిరి

(హాగె> ఆగె> ఆగ)

తెలుగు. అట్లు = వలె, మాదిరి (అట్లు> )

నీ అగ + అట్ల> నీ అగ అట్ల> నీ అగట్ల>
నీ (య్) అగట్ల

> యాట్లనీగ> నీయాకట్ల

కన్నడపదం అగె (హాగె) అన్నది, అట్ల (అట్లు) అనే తెలుగుపదంకలిసి 'నీయాకట్ల' రూపమేర్పడింది.

### 2. 3. సంకర రూపాలు

కన్నడ నామ వాచకానికి తెలుగు విశేషణ పదం చేర్చి వ్యవహరించబడుతుంది.

ఉదా :- తెల్ల జిబ్బ (తెల్లమచ్చ)

క. చిబ్బ = ఒకవిధమైన చర్మరోగం, మచ్చ

తె. సిబ్బె/సిబ్బి ,, ,,

తెల్లదనంలో లాగా చ, జగామారడం అంతర్నిర్మాణంలోని అనునాసిక కారణమై వుండాలి.

### 2. 4. విధ్యర్థక రూపాలు :-

కన్నడలోని విధ్యర్థక ప్రత్యయం 'ఇ' చేరిన కొన్ని తెలుగు క్రియాపదాల విధ్యర్థక రూపాలు వినిపిస్తాయి.

ఉదా :- పిలీ, నడీ, కలీ (పిలుచు నడచు, కలుసు) అవమనికి

అతన్ని పిలీ (అతన్ని పిలుచు)

(కన్నడ క్రియాపదాలు విధ్యర్థకంలో ఈ విధంగా వున్నాయి. ఉదా. మాడి, హోగి మొదలైనవి.)

### 2. 5.కిలార్థం :-

క. అంతె. త> ట

తె. అంట> అంట> అట

చేస్తాడంట> చేస్తాడట> చేస్తాట

2.6. కన్నడ ధాతువులకు తెలుగు క్రియలలో వచ్చే అనుబంధ ప్రత్యయాలు చేర్చి వాడడం.

ఉదా: ముక్కళించు (పుక్కిలించు)

కన్నడ ధాతువు ముక్కళ్; క్రియ—ముక్కళిసు. తెలుగు—ఇంచు. ఈదేవిధంగా చిముకురించు. (కన్నడ ధాతువు 'చిముక్'కు తెలుగు అనుబంధ ప్రత్యయం 'ఇంచు' చేరింది)

27. తెలుగులో 'మనం' వాడే చోట్ల ఈ ప్రాంతాల్లో 'మేము' వాడకముంది.[1]

మనం పోదాం (inclusive)

మేం పోదాం (exclusive)

క. నావు inclusive exclusive

## 3. పదబంధాలు

సరిహద్దు ప్రాంతాల్లోని ప్రజలు వాడుకలో ఈ విధమైన పదబంధాలు వినిపిస్తాయి. ఒక కన్నడ పదానికి ఒక తెలుగుపదం చేర్చి వ్యవహరించడముంది.

ఉదా: బెంకి పెట్టి (క. బెంకి = అగ్గి; పెట్టిగె = పెట్టి)

కబ్బిణపెట్టి (క. కబ్బిణ = ఇనుము)

## 4. పదక్రమం

సమాస రూపాల్లో కన్నడ నిర్మాణ ప్రభావం కనిపించే చోట్లు వున్నాయి.

ఉదా: తల్లీదండ్రులు, అమ్మా నాన్న (తె)

తందెతాయి, అప్పా అమ్మ (క.)

అమ్మా నాన్న అని వ్యవహరించినపుడు పదక్రమంలో తెలుగు నిర్మాణమే వుంది. అప్పా అమ్మ అని వ్యవహరించినపుడు మాత్రం పదక్రమంలో కన్నడ నిర్మాణం వుంది. ఎందుకంటే అప్ప అనేపదం కన్నడ ప్రభావం చేత వచ్చింది కాబట్టి.

## 5, కొన్ని విలక్షణ పదరూపాలు

1 *అగత్యంగా* : క. అగత్య. 'తప్పకుండ' నేను శుక్రవారం నాడగ్యంగా వస్తాను. 'నేను శుక్రవారంనాడు తప్పకుండా వస్తాను' (తెలుగులో గత్యమంటే అవసరం అనే అర్థం వుంది.)

2. *అరకువ* : క. అరకె. 'జీర్ణము'. నాకన్నం అరకువ కాలెదు. నాకన్నం అరగలేదనికూడా వ్యవహారంలో వుంది. (తె. అరక్కపోవడం.)

3. *అసడ్డం* : క. అసడ్డె. 'ఆటంకం' ఈ పొద్దు వూరికి పోదామంటే అన్నీ అసడ్డాలే.

4. *కుణుసు* : క కుణి. 'నాట్యంచేయు'

వాడుబలే కుదుస్తాడు. బయల్నాటకంలో లయబద్ధంగా అడుగులు తొక్కడం ఒక పద్ధతి వింది (పాటకనుగుణంగా). ఆ అడుగులు తొక్కడాన్ని 'కుణసడం' (కుణిసేది) అంటారు. ఆ నాటకాలలోని మాటలు పాటలు నేర్చుకొని బయల్నాటకం వేస్తుంటారు.

ఆమెబలేకుణుస్తుంది -ఆమెబలేనాట్యం చేస్తుంది

5. *కెమ్ము* :- క. కెమ్ము. 'దగ్గు'. కిర్నెలికయి నాక్కెమ్మొస్తావుంది. (కిర్నాలికం = చిఱునాలుక). ఇక్కడ చరానికి బదులుగా కకారం వుండడం కన్నడ ప్రభావాన్ని సూచిస్తుంది.

6 *గుడిసిలి* :- క. గుడిశలు, 'గుడిసె'. గుడిసె అని కాకుండా యిక్కడి వ్యవహారంలో గుడిసిలి అని వుండడం విశేషం.

7. *గుడుగు* :– క. గుడుగు, 'ఉరుము'.మోడాలు గుడుగుతా వుండాయి. (క. మోడలు = మేఘాలు)

8. *చటం* :- క. చట, 'అలవాటు'.ఏదైనా ఒక దానికి అలవాటుపడితే అదిలేకుండాపోవడాన్ని 'చటం' అంటారు. శటం అనికూడా వ్యవహారంలో వుంది.

1. దీన్ని డా. ఆర్వీ. యస్. సుందరంగారు కూడా గుర్తించారు. చూ. 'కోలారు తెలుగు రూప నిర్మాణం' భాష — జానపదం, సదస్సు వ్యాసాల సంకలనం. (మార్చి, 1980).

9. చెండు :- క. చెండు. 'బంతి', ఇక్కడ బంతిని చెండు అంటారు.

10. దుడిసిపెట్టు :- క. దుడి, 'పనిచేసిపెట్టు'. ఈ ఎద్దులు మాకిబాగా దుడిసిపెట్టినాయి.

11. బేకు :- క. బేకు. 'కావాలి'. నాకదేబేకు— నాకావస్తువే కావాలి- అని అర్థం.

క. బేడ = వద్దు. కాని నాకు బేకులేదు అనడం కూడా యిక్కడి వ్యవహార విశేషం. నాకుబేకులేదు- అంటే నాకువద్దు అని.

12. మెయ్/మయ్/వయ్ :- క. మెయ్. 'శరీరం' మెయ్/వయ్ తిక్కమ్మా. 'వీపురుద్దమ్మా' ఇక్కడ తిక్కు అనేపదం కూడా కన్నడ పదమే (తిక్కు = రుద్దు)

13. సుగ్గి :- క. సుగ్గి 'ఒకకాలం' (Season) చెనిక్కాయ సుగ్గి 'వేరుశనక్కాయలు పండేకాలం.'.

14 సోలు :- క. సోలు. 'ఓడిపోవు'. వాడు పందెంలో సోలిపోయినాడు.

15 సుళ్ళు :- క. సుళ్ళు. 'అపద్ధం' వీడుబలే సుళ్ళునాయలు-అంటే ఎక్కువ అబద్దాలు చెప్పేవాడని అర్థం.

## 6. కొన్ని ఆసక్తికరమైన అంశాలు

6. 1. సరిహద్దు ప్రాంతాలనుండి దూరంగాపోయే కొద్దీ కన్నడప్రభావం తగ్గుతూ వస్తుంది. ఉదాహరణా నికి సంబళం అనే కన్నడపదం ఉరవకొండ (అనంతపురంజిల్లా) ప్రాంతంలో ఎక్కువగా వినిపిస్తుండగా, అనంతపురం జిల్లాలోనే అనంతపురం నుండి గుత్తికి పోయేమార్గంలో ఇది వినిపించదు. (సంబళం-జీతం)

6.2. గ్రామ నామాలు సింగనమల, కొడిగనహళ్ళి (హళ్ళి = పల్లి) మడకశిర, పెనకడపాడు ( <హనకనహళ్ళి) యిలాంటి గ్రామనామాల మీదనూ.

6.2.1. బరికైలే పోతున్నాడు [(వట్టి చేతులతో పోతున్నాడు) క > చగా మారని రూపం] లాంటి రాయదుర్గం వ్యవహారాల నాధారంగానూ ఈ ప్రాంతం తెలుగులో కంపించే కన్నడ అంశాల్ని కేవలం పద దశకు చెందింది అనడం కంటే అంతకంటే శాస్త్రీయంగా కన్నడ నిర్మాణ ప్రభావం structural pressure) అని ఊహించడం సమంజసంగా కనిపిసుంది.

6 3. కన్నడ జాతీయాలు, సామెతలు, పొడుపు కథలు వీటి ప్రభావం కూడా ఈ ప్రాంతంలోని ussage మీద వుండడం ఆసక్తికరమైన విషయం. ఇక్కడ తత్వగేయాలు[1]. కూడా కన్నడలో విపరీతంగా పాడుకోవడాన్ని చూస్తే ఈ ప్రాంతాల్లో కన్నడ ప్రభావం ఎంత వుందో మనం ఊహించవచ్చు

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం—3.

1. మచ్చుకు ఒక కన్నడ తత్వగేయానికి చూ. ఎ. హనుమప్ప 'తత్వగేయాలు — బ్రహ్మసారం' స్రవంతి (జనవరి '82) పు. 17.

# సుమతీ శతకము, రహీమ్ సత్ సయీా-
# తులనాత్మక పరిశీలన

—శ్రీహరి రామం ఎం. ఏ.

సాహిత్యం సమాజాన్ని ప్రతిబింబిపజేసే దర్పణమే కాదు, దాన్ని సముచిత పంథాన నడిపించే పకాశ స్తంభం కూడ. ఫొటోగ్రాఫర్‌వలె కేవలం సమాజపు యదార్థ చిత్రాన్ని తీయగానే రచయిత బాధ్యత తీరిపోదు. సుందర సమాజం ఎలా ఉండాలో తెల్పవలసిన అవసరం కూడా రచయిత కెంతో ఉంది. కేవలం నీతి కావ్యరచన ద్వారా రచయిత ఈ లక్ష్యాన్ని సాధించగల్గుతాడు. కనుకనే పాశ్చాత్య విద్యాంసులు 'నీతి'ని కావ్యం యొక్క మః మని ఎలుగెత్తి చాటారు.

'The theme of Poetry is moral order'

'ణీయ' ధాతు జనితమైన 'నీతి' శబ్దమునకు 'ముందుకు వెడలుట' అన్న అర్థము గలదు. సదా ప్రగతిని కాంక్షించే మానవ జీవితంలో 'నీతి' కెంతో ప్రాముఖ్యత గలదు. సమస్త మానవజాతి నీతి నాధారం చేసుకుని ప్రగతి మార్గాన పరుగిడుతోంది. కనుకనే ప్రసిద్ధ నీతి శాస్త్రమైన 'శుక్రనీతి సారం'లో "ప్రాణుల భౌతిక వికాసానికి భోజనమేరీతి అవసరమో, అట్లే లోకవ్యవహారానికి నీతి ఆవశ్యకమ"ని నొక్కి వక్కాణించబడింది. అందుకే ఆంగ్ల మహాకవి వర్డ్స్ వర్తు ప్రతి కవిని నీతి శాస్త్రాచార్యులుగా స్పష్టీకరించారు.

"Every great Poet is a teacher I wish to be considered as a teacher or as nothing at all."

అనాది నుండి భారతావని నీతి ప్రధాన దేశముగా ప్రసిద్ధి కెక్కింది. భారతీయ కవులు విశ్వవిఖ్యాత కవులేకాక ఆదర్శ సమాజ ప్రేమికులు, మార్గదర్శకులు కూడ. కనుకనే వారి గ్రంథాలలో నీతి అత్యంత ప్రాముఖ్యత వహించింది ఇట్టి నీతి కావ్యాలలో హిందీ సాహిత్యంలోని రహీమ్ సతసయీా, తెలుగు సాహిత్యంలోని సుమతీశతకం అత్యంత ప్రసిద్ధ గ్రంథాలు.

16వశతాబ్దికి చెందిన అబ్దుర్రహీమ్‌ఖాన్ ఖానా అదే కవి ప్రసిద్ధ కృతి 'రహీమ్ సతసయీా'. 'సుమతీ శతకం' బద్దెనా మాత్యుని ప్రణీతమని విద్వాంసుల విశ్వాసము. రెండు గ్రంథాలలోనూ తెల్పబడిన నీతి సూత్రాలు సర్వకాల సర్వావస్థల యందూ ఆచరణ యోగ్యాలు.

రహీం హిందీ సాహిత్యంలోని 'భక్తి కాలపు' కవి. ఇతను 1613 వి॥ సం॥ న జన్మించాడు. రహీం భక్తుడు, దాత, శూరుడు, యోగ్యసేనానియే గాక వివిధ భాషా కోవిదుడు. ప్రకాండ పండితుడు, అక్బరు ఆస్థానంలోని నవరత్నాలలో ఒకనిగా వాసికెక్కుట ఇతని యోగ్యతకు, గొప్పతనమునకు తార్కాణము. రహీము సాహిత్య మంతయూ లభ్యము కాకున్ననూ రహీమ్

సతసయీ, రహీమ్ దోహావలీ, రహీమ్ చంద్రికా. రహీము విలాస్ కృతులుగా పరిగణింప బడుతున్నది. సుమతీ శతకకారునిగా భావింప బడుతున్న బద్దెన కాకతి సామ్రాజ్ఞి రుద్రమదేవికి సామంతుడు. ఇతడు కృష్ణా జిల్లాలోని చిన్న మండలానికి అధిపతి. బద్దెన నీతి శాస్త్ర గ్రంథమనే పేరుతో 150 పద్యాలలో 'రాజ నీతి'ని వర్ణించారు. ఇది ప్రతాప రుద్రుని సంస్కృత 'నీతిసార'మనే గ్రంథానికి తెలుగు రూపాంతరమని కొందరి విద్వాంసుల ఉవాచ. 'సుమతీ' మకుటముతో వ్రాసిన సుమతీ శతకము బద్దెన ప్రసిద్ధగ్రంథం.

ఇరువురూ సుప్రసిద్ధ నీతి కోవిదులు అత్యుత్తమ సూక్తి నిధులు. ఇరువురి గ్రంథాలలో ఉత్తమ నీతి కావ్యలక్షణాలు ప్రస్ఫుట మౌతాయి నీతి గ్రంథాలలో ఏదేని నీతికిగానీ, ఉపదేశానికిగాని ప్రాముఖ్యత నివ్వాలి. నీతి కావ్యాల భాష ప్రవాహ పూర్ణమై, సరళమై ఉండాలి. అభివ్యక్తీకరణలో స్పష్టత ఉండాలి. ఇతరులను ప్రభావితం చేయడానికి సుందరమైన దృష్టాంతాల నివ్వాలి. ఈ రెండు గ్రంథాలలోనూ ఈ నీతి కావ్య లక్షణాలు అతి సుందరంగా సమావృతమైనాయి

మానవుడు సంఘజీవి. పరిసరాల ప్రభావంచే అతని వ్యక్తిత్వం వికసిస్తుంది. సజ్జన సాంగత్యంచే దుర్జనుడు సజ్జనుడౌతాడు. దుస్సంగతిచే సజ్జనుడు దుర్జనుడవుతాడు. అరటి ఆకు, రేగి ముల్లుల దృష్టాంతంలో రహీము ఈ భావాన్ని ఇలా వివరించాడు.

"కహు రహీం కైసే నిభై, బేర్ కేర్ కురు సింగ్।
వేడోలత్ రస్ అపునే, ఉన్‌కే ఫాటత్ రంగ్॥"

[అరటి ఆకు, రేగిముల్లుల సాంగత్యం అసంభవం. ఇందులో ఏది (గాలికి) ఊగినా, ఆకు శరీరమే గాయ పడుతుంది.]

"నల్లి సాగత్యంచే మంచానికి దెబ్బలు తగిలినట్లు దుర్జన సంగతిచే మనిషికి కీడుకలుగుతుంద"ని బద్దెన సుమతీ శతకంలో స్పష్టీకరించారు.

"కొంచెపు నీరు సంగతిచే
నంచితముగ గీడు వచ్చు। నదియెట్లన్నన్।
కించిత్తునల్లి కుట్టిన
మంచమునకు పెట్లువచ్చు। మహిలో సుమతీ।"

దుస్సంగతిచే సుజనులు కుజనులుగా పరిగణింప బడతారు. కల్లు అమ్మే స్త్రీ పాలమ్మసాగినా ప్రజలు విశ్వసించరు.

"రహిమన్ నీచన్‌సింగ్ బసి, లగత్‌కలంక్ నకాహి।
దూధ్ కలారిన్ హాథ్‌లఖి, సబ్ సముఝత్ మద్ తాహి"

[నీచుల సాంగత్యంలో ఉంటే ఎందుకు కళంకము కలుగదు? (కలుగునని అర్థము). కల్లు అమ్మేస్త్రీ చేతిలోపాలను చూసినా ప్రజలు దానిని కల్లు అనే అనుకుంటారు].

'నీతి సాంగత్యంచేపాలు తమ రుచిని కోల్పోతా య'ని బద్దెన ఇలా వివరిస్తున్నారు.

'పాలను కలసిన జలమును
బాల విధంబుననే యుండు। బరికింపంగా
బాల చవి చెఱచు గావున
బాలిసుడగు వానిపొందు। వలదుర సుమతీ!'

ఇరువురు సూక్తికారులూ మూర్ఖుల మనస్తత్వానికి దర్పణంపట్టారు. 'శతవిధాల యత్నించినా దుష్టుని లేక మూర్ఖుని చెడు గుణం చెరపలేమ'ని రహీం దృఢ విశ్వాసం.

"రహిమన్ లాఖ్ భలీంరో, అగునీ అగున్‌న జాయ్।
రాగ్ సునత్ పయ్ పియత్‌హు, సాంప్ సహజ్ ధరి కాయ్॥"

[లక్ష ప్రయత్నాలు చేసినా కుజనుల దుర్గుణాలు మాన్పలేము. సంగీతానికి ఆకర్షింపబడి, పాలు త్రాగినా పాము తన సహజ గుణాన్ని (విషము కుక్కుటం) వదలదు.]

"కనకపు సింహాసనాన్ని అధిష్టించినా, శునకము తన గుణాన్ని విడజాలదం" టూ బద్దెన మూర్ఖ స్వభావాన్ని విశదీకరించారు.

'కనకపు సింహాసనమున
శునకము కూర్చుండబెట్టి! శుభలగ్నమునం
దొనరగ బట్టము గట్టిన
వెనకటి గుణమేల మాను (వినరా సుమతీ)'

అందుకే "ఉత్తమ గుణములు నీచునకు రావ"ని బద్దెన నొక్కి వక్కాణించారు.

"ఉత్తమ గుణములు నీ చున
కెత్తెర గున గలుగనేర్చు! నెరయెడలందా
నెత్తిచ్చి కరిగి పోసిన
నిత్తడి బంగారమగునె! యిలలో సుమతీ!

ఈ జగతికి మూలంధనం. ధనం వల్ల మానవుని కీర్తి పెరుగుతుంది. అన్నిచోట్ల ధనవంతుడు వేనోళ్ళ కీర్తింప బడతాడు. ధనమున్నంత సేపూ శత్రువులు కూడా మిత్రులుగా ఉంటారు. ఇదే భావాన్ని రహీమ్ ఇలా వ్యక్తం చేస్తున్నారు.

"జబ్‌లగి విత్తన అపునే, తబ్‌లగి మిత్‌నకోయీ।
రహిమన్ అంబుజ అంబు జిను, రవి నాహిన్
హిత్ హోయ్॥"

[మనిషి వద్ద ధనము లేకున్న, అతని కెవరూ మిత్రులుకారు. నీటిలో ఉన్న కమలం సూర్యకిరణాలకు వికసిస్తుంది నీటినివిడిచిన కమలం ఆదేకిరణానికి వాడిపోతుంది].

సుమతీ శతకంలో కూడ ధనమహిమను తెలిపే పద్యాలు ఎన్నో కనిపిస్తాయి "బంధువులందరూ మన ధనముతో బంధుత్వం కలుపుతార"ని బద్దెన చాటుతున్నారు

"ఎప్పుడు సంపద కలిగిన
అప్పుడు బంధువులు వత్తు! రది యెట్లన్నన్!
తెప్పలుగ చెరువు నిండిన
కప్పలు పదివేలు జేరు! గదరా సుమతీ!"

ధనమాశించి మనలనాశ్రయించు బంధువుల మనస్తత్వాన్ని గురించి బద్దెన ఇలా అంటున్నారు.

"చుట్టములు గాని వారలు
చుట్టములము నీకటంచు! సొంపుదలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబులుగ! గదరా సుమతీ!"

కలిసి వచ్చిన దినాలలో కళకళలాడినట్లు, కలిసిరాని రోజుల్లో మానవుడు వెలవెలపోక తప్పదు. కష్ట దినాలలో గడ్డి పరక కూడ నాగుపాము రూపు ధరిస్తుంది. మిత్రులందరూ శత్రువులౌతారు. "కష్టకాలం వల్ల మన శత్రువులెవరో, మిత్రులెవరో స్పష్టమౌతుంద"న్న నమ్మకంతో రహీం కష్టాల నాహ్వానిస్తున్నారు

"రహిమన్ విపదాహూ భలీ, జోథోరేదిన్ హోయ్
హిత్ అన్‌హిత్ యాజగత్‌మే, జానిపరత్ సబ్
కోయ్."

(కొన్ని దినాలైనాసరే, కష్టకాలమేమంచిది. కష్ట దినాల వల్ల హితులు, అహితులు ఎవరో స్పష్టంగా తెలుస్తుంది. ఆపదలలో కూడ ఆదుకున్నవాడే నిజమైన హితుడు).

"కలిసి వచ్చిననాడు కాననంలో ఉన్నా, అన్నీ అమరుతాయి. కష్టదినాలలో కనకపు సింహాసన మధిష్టించినా వ్యర్థమే" అని బద్దెన అభిప్రాయము.

"పెట్టిన దినములలోపల
నట్టడవులకైన వచ్చు। నానార్థములున్
పెట్టని దినముల గనకపు
గట్టెక్కినవేమిలేదు। గదరా సుమతీ!"

సత్యభాషణము మనిషికి విభూషణము. మాటకు ప్రాణము సత్యము. ఈ భావాన్ని ఇలా వ్యక్తం చేస్తున్నారు.

మాటకు ప్రాణము సత్యము
కోటకు ప్రాణంబు సుభట। కోటి ధరిత్రిన్।
చోటికి ప్రాణము మానము
చీటికి ప్రాణము వ్రాలు। సిద్ధము సుమతీ।"

కానీ రహీంలోని ఈ భావ వ్యక్తీకరణలో లౌక్యం కనిపిస్తోంది. సత్య భాషణవల్ల ఇహంలో కార్య సాధన జరగదు. అసత్య వచనము వల్ల పరంలో స్వర్గ ప్రాప్తి కలుగదు.

"అబ్ రహీమ్ ముస్కిల్ పడీ, గాఢే దోటకామ్।
సాంచే సోతో జగ్‌నహీ, ఝూఠే, మిలైనరామ్॥"

(సత్యవచనము వలన, అసత్య వచనము వలన కష్టమే. నిజాయితీగా ఉండి, నిజం పలుకుతుంటే ప్రపంచంలో జీవించలేము. అబద్ధం పలికితే ముక్తి లభించదు).

పరోపకారం మానవుని ఉత్తమ గుణము, పరోపకారి, నిస్వార్థి జన్మధన్యమైనది. "పరులకుపలకరించని విశాల సాగరముకన్నా పథికుల దాహము తీర్చుకుంట నీరు మిన్న" అని రహీము తన భావాన్ని ఇలా వ్యక్తం చేస్తున్నారు.

"ధని రహీమ్ జలపంక్‌కో, లఘు జియపియత్ అఘాయ్।
ఉదధి బడాయీ కౌన్‌హై, జగత్‌పియా సోజాయ్।"

(అల్ప ప్రాణులకైనా దప్పికతీర్చి, తృప్తినిచ్చే గుంటనీరు ధన్యమైనది. జగతి దాహాన్ని తీర్చలేని సాగర వైశాల్యము వల్ల ఎవరికి లాభము?)

అపకారికైనా ఉపకారము చేయాలన్న గొప్పనీతిని సుమతీశతకకారుడు వర్ణిస్తున్నాడు.

"ఉపకారికి నపకారము
విపరీతము కాదు సేయ। విపరింపంగా
అపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు। నేర్పరి సుమతీ!

ఏపనైనా పరిపక్వ స్థితిలోనే సఫలమౌతుంది. తొందరపాటువల్ల పనులు జరుగవు సరికదా చెడిపోయే అవకాశముకూడా ఉంది ఇదే భావాన్ని రహీమ్ ఇలా వ్యక్తం చేస్తున్నారు.

"సమయ్ పాయ్ ఫల్ హోత్‌హై, సమయ్ పాయ్ ఝరిసదారహేనహి ఏక్ సీ, కా రహీమ్ పఛితాత్"[1]

[తగిన కాలములోనే చెట్లకుపూలు పూస్తాయి, కాయలు కాస్తాయి ఆకురాలు కాలంలోనే ఆకులు రాలతాయి. ఇదేవిధంగా అందరిస్థితి ఎల్లప్పుడు ఒకటిగా ఉండదు ]

...ండా, సమయానికి ముందే పనులు నెరవేరవ'ని బద్దెన అంటున్నారు.

"తడవోర్వక, యొడలోర్వక
కడువేగంబడిచి పడిన। కార్యంబగునే
తడవోర్చిన యొడలోర్చిన
జెడిపోయిన కార్యమెల్ల। జేకురుసుమతీ।".

ఏ ప్రాణికైనా తన స్థానము అత్యంత శక్తివంతమైనది. స్వస్థానం వదలి అన్యత్రా సుఖాన్ని ఆశించేవారు నిందలకు గురవుతారు. అప్పుడు ఆతనిమిత్రులు కూడా శత్రువులవుతారు. ఇదేభావాన్ని రహీమ్ఇలా వ్యక్తం చేస్తున్నారు.

"మెహమాస్ లహిచేసు ఆ, మోన్‌పర్‌థల్‌బొర్।
త్యోం రహీం జగ్ జానియే, ఘటే ఆపునే ఠార్"

[ప్రపంచంలో స్వస్థానం వదలిన ప్రాణుల బ్రతుకు దుర్భరము. ఉదాహరణకు, నీటిని వదలిన చేప భూమిమీద పడగానే మరణిస్తుంది. అదేవిధంగా మాఘమాసంలో మోదుగుచెట్టు అస్తవ్యస్తమౌతుంది ]

"నీటిలో నివసించే కమలానికి సూర్యకిరణాలు మిత్రులు. నీటిని బాసిన కమలానికి ఆవేకిరణాలు శత్రువులౌతాయం"టూ బద్దెన ఇదేభావాన్ని ఇలా వ్యక్తం చేస్తున్నారు.

"కమలములు నీటబాసిన
కమలాప్తుని రశ్మిసోకి। కమిలిన భంగిన్
తమతమ నెలవులు తప్పిన
తమవారే శత్రులగుట! తథ్యముసుమతీ।"

ఈ విధముగా నీతి గ్రంథకర్తలిద్దరూ ప్రతి పాద్య విషయాన్ని అత్యంత సరళమైన, సుబోధమైనభాషలో వ్యక్తం చేసారు. అత్యంత సామాన్యమైన, సర్వజన గ్రాహ్యమైన ఉదాహరణలతో ఇద్దరూ తమఉప దేశాన్ని పామర జనరంజక మొనర్చారు. ఇద్దరిభాష సరళము, స్వాభావికము, ప్రవాహపూర్ణము కను నే ఈ పద్యాలను సామాన్యపాఠకుడుసైతము ఆకళి పు చేసికొని, కంఠస్థం చేయగలడు.

రహీము తన సత్‌సయీని దోహాలలోవ్రాస్తే బద్దెన తన శతకాన్ని కందపద్యాల్లో రచి చాఖ హిందీ సత్‌సయీ వాఙ్మయంలో రహీమ్ సత్‌సయీ సముచిత స్థానాన్ని అలంకరిస్తే, తెలుగుశతక సాహిత్యంలో "సుమతీశతకం సముచితస్థానాన్ని ఆక్రమించుకొంది. ఇరువురి ఉపదేశాలు. నీతివ నాలూ అత్యున్నతమైనవీ, అపూర్వమైనవీ అనడం అతిశయోక్తికాదు. సుమతీశతకంలోని రెండుపద్యాలైనా కంఠస్థంకాని ఆంధ్రుడు కాగడావెలుగులోనైనా కానరాడు. నేటికీ హిందీప్రాంతాలలో రహీము దోహాలను అనేక విషయాలకు ఉదాహరణలుగా వాడుతుంటారు. కనుకనే ఇద్దరు కవులూ ఇంతటికీర్తిని అర్జించుకోగలిగారు. ఇంతెందుకు, సుమతీశతకం, రహీము సత్‌సయీ, తమతమ భాషలరత్నాలేకాదు, విశ్వనీతి సాహిత్యాన్నికూడా గర్వింపజేయగల ఉత్తమనీతి గ్రంథాలనడం సత్యదూరము కాదు.

హిందీలెక్చరర్
మధుమలంచ డి।గీ కాలేజి
షక్కర్ నగర్. 503180
నిజామాబాద్‌జిల్లా.

# తెలుగు నవలల్లో నూతన ప్రయోగాలు

-కె. వి. యన్. రాఘవన్

ఈనాటి తెలుగు నవలవయస్సు నూటపదేళ్ళు. ఈపదకొండు దశాబ్దాలకాలంలో తెలుగునవల వాసి లోను, రాసిలోను చెప్పుకోదగిన దశను చేరిందనిచెప్ప వచ్చు. కేవలం విషయవివరణమే ప్రధానాంశమైన రాజశేఖరచరిత్రనుంచి ఈనాటి చివుకుల పురుషోత్తం నవలలవరకు పరిశీలిస్తే తెలుగునవల చిత్రవిచిత్ర రూపాలతో దర్శనమిస్తుంది.

ఏ రచనైనా ప్రధానంగా రెండు అంశాలపైన ఆధారపడి ఉంటుంది. ఒకటి వస్తువు, రెండవది రూపము. ఈవస్తువునే ఈనాడు ఇతివృత్తమని, Content అని, plot అని వ్యవహరిస్తున్నారు. ఈరూపాన్ని From అని, శిల్పమని సంవిధానమని, కథాకథనమని వ్యవహరిస్తున్నారు. ప్రతివస్తువు ఏదో ఒకరూపం ద్వారా వ్యక్తీకరింపబడుతుంది. ఉదాహరణకు లోకంలో ఒక సంఘటన జరిగింది దాన్ని యథాతథంగా చెపితే అది వొట్టి 'వార్త' అవుతుంది. ఆధునిక పరిభాషలోచెపితే Journolistic from అవుతుంది ఆదేవస్తువు ప్రతిభావంతుడిద్వారా, ఆతని యొక్క అనుభవాలకు, అనుభూతులకు, మానవజీవితం లోని నిత్యసత్యాలైన అనంతవిషయాలకు జోడించు కొని అభివ్యక్తీకరింప బడినపుడు అది గొప్పనవల గానో, కావ్యంగానో వ్యవహరింప బడుతుంది. ఇక్కడ ఆ వస్తువు ధరించినరూపం విలక్షణంగా ఉంటుంది. తత్పూర్వం ఆవస్తువులోలేని బిగువు, సౌందర్యం విశ్వజనీనలక్షణం రూపంలో బంధింపబడినపుడు చోటుచేసు కుంటాయి. అంటే వస్తువుయొక్క ప్రయోజనంరూపం ద్వారా సిద్ధిస్తుంది. ఒకేవస్తువు కాని, లేక విభిన్నవస్తువులు కాని రచయితయొక్క ప్రతిభ, వ్యుత్పత్తి, సంస్కారం, గాఢానుభూతుల ప్రభావంతో విభిన్న కళాత్మక రూపాలను ధరిస్తాయి. దీనికి సంస్కృత నాటకాలను ఉదాహరణంగా గ్రహించవచ్చు అంటే రూపం రచయితయొక్క, దర్శనంమీద, ప్రతిభా పరిణతిమీద ఆధారపడి ఉంటుంది. దేవాలయ నిర్మాణ మెటువంటిదో కావ్యము, లేక నవలానిర్మాణము అటువంటిదే. దేవాలయంలో స్వామి కేంద్ర బిందువు. ఆస్వామియొక్క లీలలను, మహిమలను వ్యాఖ్యానిస్తూ నానావిధ శిల్పసంవిధానాత్మకంగా, ఉంటుంది, దేవాలయం. కావ్యము, లేక నవలకూడ అంతే. పరిపుష్టమైన శిల్పనిర్మాణ సౌందర్యంతో కూడినరచనలో కేంద్రబిందువైన రచయిత దర్శనానికి ఉన్ముఖంగా సంఘటనలు, పాత్రలు, వర్ణనలు, సమస్తమూ నిర్మింపబడి ఉంటాయి.

తెలుగునవలల్లో నూతన ప్రయోగాలను పరిశీలించే ముందు ఒక విషయం గమనించవలసిఉంది. తెలుగు నవలకు ఎవరూ ఇంతవరకు లక్షణనిర్దేశం చేయలేదు. 1893లో చింతామణి పత్రిక నవలలపోటీ నిర్వహిస్తూ కొన్ని నిబంధనలను ప్రకటించింది. అవితప్ప మరెవ్వరూ నవలకు వస్తువిది, నిర్మాణమిది అని నిర్ణయం చేయలేదు. ఆవిధంగా లక్షణనిర్దేశం జరిగింది. అదొక సంప్రదాయంగా ఉన్నపుడు, అసంప్రదాయాన్ని భేదించో లేక ఆసంప్రదాయ పరిధిలోనే అంతవరకు వచ్చిన రూపాలను క్రొత్తరూపాన్ని సంతరించుకున్నపుడు దాన్ని నూత్నప్రయోగంగా చెప్పవచ్చు. కానీ ఇక్కడ తెలుగునవలల్లో ఉన్నఅంశాలలోని అను

స్యూతిని సంప్రదాయంగా భావించి నూత్నప్రయోగాలను పరిశీలించవలసి ఉంది. తెలుగునవలలను రూపం దృష్ట్యా పరిశీలిస్తే స్థూలంగా ఈ క్రిందిరూపాలు కనబడుతాయి.

(1) రచయిత నేరుగా కథచెప్పడం
(2) రచయిత నేరుగాకథచెపుతూ మధ్యమధ్యలో పాత్రలద్వారా కథనడపడం.
(3) పాత్రలద్వారానే కథనడపడం | రెంటినీఒకటిగా
(4) సంఘటనాత్మకంగాకథనడపడం | భావించవచ్చు.
(5) ఉపన్యాసపూర్వకంగా-డైరీలరూపంగా ఉత్తరాల రూపంగా కథనడపడం.
(6) చైతన్య స్రవంతీ లక్షణం.
(7) ఆత్మాశ్రయరీతి కథనడపడం.
(8) కావ్యము-రూపకలక్షణాలను అన్వయించి కథ నడపడం.

(దాదాపుగా పైరూపాల నన్నింటిని ఐతిహాసిక నవలల్లో చూడవచ్చు)

తెలుగునవలకు ప్రథమరూపమైన "రాజశేఖర చరిత్ర" కన్నా కొంతవిలక్షణతను సంతరించుకున్న నవల "రామచంద్రవిజయం". స్థూలంగా రెండూ ఒకే రూపాన్ని ఆశ్రయించి ఉన్నా సూక్ష్మంగా పరిశీలిస్తే 'రామచంద్రవిజయం' కథానిర్మాణంలో సంవిధానాత్మకత కనపడుతుంది రామచంద్రవిజయం తరువాత వచ్చిన కర్పూరమంజరి నవలా నిర్మాణంలో కథా కథనంగా, పాత్ర నిర్మాణంగా మార్పుకనబడుతుంది. భాషలో వచ్చిన మార్పు కూడ విశేషమే.

ప్రప్రథమంగా వస్తువులోను రూపంలోను అంత వరకూలేని విలక్షణతను సాధించుకొన్న నవల ఉన్నవ "మాలపల్లి" నవలలో సంపూర్ణ మానవజీవితాన్ని, సమగ్ర మానవ సమాజాన్ని చిత్రీకరించడం వల్ల నవల స్థాయి సామాన్య దశనుదాటి దేశకాలాల ఎల్లలను త్రెంచుకొని ఐతిహాసిక స్థాయికి ఎదిగింది.

ఇతిహాసం పూర్ణ మానవ జీవితానికి సుందర కథా రూపవ్యాఖ్యానం. మాలపల్లి ఒక జీవితకాలం కథ. మట్టినుంచి రామదాసు పెరిగి పెరిగి మహర్షి అవుతాడు. మానవుని యొక్క భౌతిక, సౌందర్య, ఆధ్యాత్మిక జీవితాన్ని వ్యాఖ్యానిస్తు మట్టి నుంచి స్వర్గందాకా కథను పెంచడంలో మహాభారత కథా నిర్మాణాన్ని స్ఫురింపజేస్తుంది. బ్రహ్మయజ్ఞంతో ప్రారంభమయిన నవల బ్రహ్మయజ్ఞంతో పూర్తవుతుంది. (అసలు కథ బుచ్చయ్య వద్ద సంగదాసు, రామానాయుడు ఉపదేశం పొందినప్పటి నుంచి మొదలై విజయ కళాశాల స్థాపనతో పూర్తవుతుంది) నవలలో మొదట సంగదాసుకు రామానాయుడుకు ఉపదేశ మిచ్చి బుచ్చయ్య మాయమవుతాడు. రామదాసు జైలులో ఖైదీలకు ఉపదేశమిచ్చి కడకు అదృశ్యమవుతాడు. సంగదాసు, రామదాసు నడిపిన ఉద్యమం వెనుక బుచ్చయ్య ఆధ్యాత్మిక శక్తి పని చేసింది. విజయ కళాశాలస్థాపన వెనుక రామదాసు యొక్క ఆధ్యాత్మిక శక్తి పని చేసింది. ఈ ఆధ్యాత్మిక శక్తిని కాదని వెంకటదాసు నడిపిన ఉద్యమం విఫలమవుతుంది. నైతికపు, ఆధ్యాత్మికపు పునాదులులేని ఉద్యమం ఏ విధంగాను సఫలంకాదన్న భారతీయ దార్శనికతే మాలపల్లికి ప్రాణభూతమైన మహావిషయమైంది. నవలలో రామదాసు కథ చుట్టూ ప్రత్యక్షా ప్రత్యక్షంగా జ్యోతీ అప్పాదాసుల కథ, కమలామోహన్‌ల కథ, వెంకటదాసుకథ, ఖైదీలకథలు సంబంధం కలిగి ఉన్నాయి. వీటన్నిటిని ఉపాఖ్యానాలుగా భావిస్తే మాలపల్లి తెలుగు నవలలో బృహన్నిర్మాణం. మాలపల్లి తరువాత పది పన్నెండేళ్ళకు వచ్చిన వేయి పడగల నిర్మాణంతో పోల్చినపుడు మాలపల్లి నిర్మాణంలో బిగువు కనబడదు. మాలపల్లి శిథిల బంధము. కాని ఐతిహాసిక లక్షణాలను తెలుగు నవలకు సంతరించిన

మొదటి నవల మాలపల్లి. అడవిబాపిరాజుగారి మాటలలో చెపితే "తెలుగు నవలా చరిత్రలో రెండవ యుగానికి గోపురద్వారం" మాలపల్లి.

మాలపల్లి తరువాత అంతకన్నా మహాశక్తిమంతమైన నిర్మాణ శిల్పంతో అంతవరకు వచ్చిన అన్ని మార్గాలను, రూపాలను జీర్ణించుకొని తనదైన వ్యక్తిత్వంతో వ్యక్తమైన నవల విశ్వనాథ "వేయిపడగలు". 'అంతరాత్మ' నుంచి "నందిగామ రాజ్యం" వరకు విస్తరించిన నవలా ప్రపంచంలో ఏ నవలకా నవల ఒక విచిత్ర సృష్టి. ఒక నవలా నిర్మాణాన్ని పోలి మరొకటి ఉండదు. ఎక్కడికక్కడ వైవిధ్యం కనబడుతుంది. తెలుగు నవలా నిర్మాణంలో మొట్టమొదటగా రూపక లక్షణాన్ని, ప్రతీకాత్మకతను, ప్రాగ్రూపాలను ప్రవేశపెట్టిన వ్యక్తి విశ్వనాథ.

విశ్వనాథవారి నవలల్లో 'ఏకవీర' శిల్పాభిరామమైన సృష్టి. సంస్కృత రూపక లక్షణాన్ని సంతరించుకొన్న నవల. నవలా నిర్మాణమే విశ్వజనీన సత్యాన్ని వ్యంజిస్తుంది నవల వైగైనదీ వర్ణనతో ప్రారంభమయి, ఆ నదీ తీరంలోనే పూర్తవుతుంది ఒక బిందువు నుంచి బయలుదేరిన కథ కడకు ఆ బిందువునే చేరుకుంది వృత్తం పూర్తయింది. అవ్యక్త చైతన్యం నుంచి వ్యక్తమై బయలుదేరిన మానవుడు మరలా ఆ వ్యక్త చైతన్య బిందువు నన్వేషిస్తూ కడకు ఆ బిందువులో కలిసి పోవడంతో వాని జీవితయానం పూర్తవుతుంది. భారతీయుడు జీవితాన్ని వృత్తంగా దర్శించాడేగాని సరళరేఖగా దర్శించలేదు. ఈ దార్శనిక లక్షణాన్నే సంస్కృత నాటక కర్తలు నవలా నిర్మాణం ద్వారా వ్యంజింపచేశారు. ఏకవీర నిర్మాణంలో కూడ ఈ దార్శనిక లక్షణం కనబడుతుంది. ఆద్యంతముల మధ్య సమన్వయంతో పరిపుష్టమైన శిల్ప నిర్మాణంతో కూడిన నవల 'ఏకవీర' నవలలో ప్రతి సంఘటన చక్కని సంవిధానాత్మకంగా వ్యక్తమవుతుంది. నవలలో ప్రతి వర్ణన రాబోయే సన్నివేశానికి పాఠకుని మనస్సును సిద్ధంచేస్తుంది అంతా కథోన్ముఖ వర్ణనలు ప్రతీకాత్మకత, త్వగింద్రియ స్పర్శ లక్షణం మొట్టమొదటగా ఏకవీర ద్వారానే తెలుగు నవలలో ప్రవేశించాయి. నాటికి నేటికి తెలుగు నవలల్లో 'ఏకవీర' నూతన ప్రయోగమే.

ఏకవీర తరువాత ఏకవీరలోని ముఖ్య లక్షణాల నన్నింటిని సమీకరించుకొని తత్కాలీన చైతన్యంలోని ముఖ్య విషయాల నన్నింటిని గాఢంగా ప్రస్ఫుటం చేస్తూ జాతి యొక్క సౌందర్య, ఆధ్యాత్మికపుటను భూతులనన్నింటిని గాఢంగా స్పృశిస్తూ వచ్చిన మరో నవల వేయిపడగలు. తెలుగు సాహిత్యంలో వేయిపడగలొక బృహన్నిర్మాణం (Gaigantic construction). ఒక మహత్తర సృష్టి ఒక మధుర మీనాక్షి దేవాలయం.

వేయిపడగలు దాదాపుగా మొత్తం పదునెనిమిదేళ్ళ కథ వేయిపడగలలో కేంద్ర బిందువు సహస్ర ఫణా మండితుడైన సుబ్రహ్మణ్యస్వామి. నవల మొత్తం ఆ కేంద్ర బిందువుకు ఉన్ముఖంగా మలచబడిఉంది. నవలలో ప్రధానమైన పాత్రలన్ని స్వామితో ఏదో విధంగా సంబంధం కలిగి ఉన్నాయి. విశ్వానికి కేంద్ర బిందువైన పరమేశ్వరుని చుట్టూ అన్ని జీవులూ, అనంత గోళాలు, సమస్త విశ్వమూ తెలిసో తెలియకో పరిభ్రమిస్తూ ఆకర్షింపబడుతూ, కర్మ ఫలితాన్ననుభవిస్తూ సాగిపోతున్నాయి. విశ్వంలో ఇది నిత్య సత్యమైన విషయం. ఈ మహా సత్యమే వేయిపడగల నిర్మాణంలో వ్యంజింపబడింది. మాలపల్లి తరువాత అంతకన్నా పరిపుష్టంగా ఐతిహాసికతా లక్షణాలను సంతరించుకొన్న నవల వేయిపడగలు. వేయిపడగలలో వస్తువు తత్కాలీనమైనా ఆ వస్తువు నిర్వహణలో భూమ్యాకాశముల అంచుల వరకు సుందరంగా ఎదిగి పోవడంతో దేశ కాలములు రెండూ విస్తరింపబడినాయి, వేయిపడగలు మూడుతరాల మీద పరచుకొన్న కథ. ధర్మారావు-అరుంధతి, గిరిక-స్వామి, కిరీట-శశిరేఖ, కుమారస్వామి-శ్యామల, జోస్యులు-

మంగమ్మ, రామేశ్వరశాస్త్రి, కృష్ణమనాయుడు, రంగారావు, పసిరిక. గణాచారి-మొదలైన ప్రముఖ పాత్రలన్ని ప్రధానకథతో లంకె వేసుకొని తమకు తాముగా ఒక విశ్వజనీనమైన సత్యాన్ని వ్యాఖ్యానిస్తాయి చైతన్యవంతమైన ప్రకృతి, మానవీయమైన అనుభూతులకు ప్రాణం పోసుకున్న పాత్రలు. ధర్మాధర్మముల మధ్య సంఘర్షణలు, మంత్రతంత్రాది అతిలోక విషయాలు, నాట్యాలంకార, యోగశాస్త్రాలేకాక, మానవ జీవితంతో పెనవేసుకొన్న అనంతమైన విషయాల సుందర సంవిధానంతో, వేయిపడగలు పరిపుష్టమైన శిల్పంగా రూపుదిద్దుకొని మానవునిలోని అనుభవ లోకాలను ఆవిష్కరించింది. వేయిపడగలు, అందుకే వేయిపడగలు తెలుగు సాహిత్యంలో ఆధునిక మహేతిహాసం.

ఇక విశ్వనాథ వారి సాంఘిక రాజకీయ నవలలైన వీరవల్లడు, మా బాబు, చెలియలికట్ట, దమయంతీ స్వయంవరం, సముద్రపుదిబ్బ, శార్వరి నుండి శార్వరి దాక, పులుల సత్యాగ్రహం బాణావతి, నందిగామ రాజ్యం మొదలైన నవలలను ఏ నవలకా నవలను ప్రత్యేకంగా పరిశీలిస్తేగాని నిర్మాణగత సౌందర్యాని, నూతన ప్రయోగ లక్షణాన్ని గుర్తించలేము.

వీరవల్లడి నవల చాలా అందమైన సృష్టి నవల మొదటి నుంచి కడవరకు ఉత్తమ పురుషలోనే సాగుతుంది. కథ మొదలు పెట్టక పూర్వమే పాఠకుని మనస్సును కథకున్ముఖంగా మలచడం విశ్వనాథ కథా కథన శిల్పంలో ఒక భాగం వీరవల్లడి వంటి అతి చిన్న నవలతో కూడ ఈ శిల్పాన్ని మనం చూడవచ్చు. అందమైన పలుకుబళ్ళు జాతీయాలు, సామెతలు, భావ వ్యక్తీకరణ పద్ధతి యందుండే పలుకుబడిని (Accent) పట్టుకొని చేసిన రచన వీరవల్లడు.

అన్నిటికన్నా విచిత్రమైన నవల "దమయంతీ స్వయంవరం" కథలేని నవలయిది. కానీ విశ్వనాథ దాన్ని రాజకీయ నవల అని అన్నాడు. అదే రాజకీయ నవలైన "సముద్రపుదిబ్బ"లో కథ ఉంది. క్రమ పరిణామంలో వ్యవస్థలోని మార్పులను చూపెట్టడం జరిగింది. దానికి స్పష్టమైన రూపం కనబడుతుంది. కానీ దమయంతీ స్వయంవరానికి రూపం ఇదీ అని చెప్పలేము. నవలంతా పైకి ఏకో కబుర్లతో నడిచినట్లనిపిస్తుంది. దమయంతీ స్వయంవరం పేరుతో చెప్పిన కథ నవల మధ్యలో ప్రారంభమవుతుంది. రచయితే నవలలో "కథా ప్రారంభము" ప్రథమాధ్యాయము అని మధ్యలో మొదలు పెట్టారు. మొదటి భాగంలో జరిగిన కథంతా వాచ్యంగా ఉంటుంది. రెండవ భాగంలో చెప్పిన 'దమయంతీ స్వయంవరం' కథ వ్యంగ్యంగా ఉంటుంది. పురాణంలోని పాత్రలకు క్రొత్త అర్థం చెప్పాడు. ప్రధానంగా నేటి పరిపాలనా వ్యవస్థను, అధికారులను, పన్నులు వేసే పద్ధతులను, భాషా శాస్త్ర పండితులను విమర్శించి కడకు ఇంటర్వ్యూల పేరిట ప్రభుత్వం ప్రజల నెలా మోసపుచ్చుతూందో, ఆ ఉద్యోగాల కోసం ప్రజలు పడే పాట్లు అన్నింటిని వెక్కిరింపుతో, హాస్యాన్ని, వ్యంగ్యాన్ని, జోడించి చమత్కారంగా చిత్రించాడు. తెలుగు నవలా ప్రపంచంలో విచిత్ర సృష్టి 'దమయంతీ స్వయంవరం'.

ఈ విధంగా పరిశీలిస్తూ వెళ్ళితే విశ్వనాథ వారి ప్రతి నవలలోను ఏదోవొక వైచిత్రి భాసిస్తూంటుంది. ఆత్మాశ్రయ రీతిలో నడిచిన "మా బాబు" నవలలో పాత్రలకు పేర్లుండవు. మ్రోయు తుమ్మెద నవలలో ఆత్మకథాప్రవేశం కనబడుతుంది. అంటే రచయితకూడ నవలలో ఒక ప్రత్యక్ష పాత్ర. ఇటువంటి ప్రయోగాన్ని తెలుగునవలలో ఇంతవరకు ఎవ్వరూ చెయ్యలేదు. ఆరునదులలో ఉపన్యాసాత్మకత, పురాణవైరగ్రంథమాల నవలల్లో ప్రాగ్రూపావిష్కరణ కనబడుతుంది. బాణావతి నవలలో ఏఒక్క భావాన్ని పోషించడు. భయభావాన్ని ప్రోదిచేస్తూ కడకు హాస్యంచేత దాన్ని విరిచి వేయడం జరుగుతుంది. ఫలితంగా ఏ భావము అక్కడ నిలవదు. నవల మొత్తం ఇదే శిల్పం. విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు, హా హా హూహూ, పులుల సత్యాగ్రహం, నందిగామ

రాజ్యం మొదలైన అధిక్షేప నవలలో దేని రూపం దానిదే. చారిత్రక నవలల్లో అద్భుత శిల్ప నిర్మాణం, పాత్రల కల్పన, వర్ణనలు, సంఘటనలు చోటు చేసుకున్నాయి. తెలుగు నవలా జగత్తులో ఇంత వరకూ విశ్వనాథ చేసినన్ని ప్రయోగాలు ఎవరూ చేయలేదు.

విశ్వనాథకు సమాంతరంగా రచనలు చేసిన వాళ్ళు బాపిరాజు, చలం. బాపిరాజు నవలల్లో రూపవైచిత్రి కనబడే నవలలు తుఫాను, హిమబిందు, గోనగన్నారెడ్డి, ఈ నవలలన్ని పరిమాణంలో పెద్దవి కావడంతో విభిన్న శిల్ప సంవిధానంతో అంతవరకు వచ్చిన అన్ని మార్గాలను ఆశ్రయించి ఉన్నాయి. బాపిరాజు నవలల్లో అంతర్నాటకం ఒక ముఖ్యమైన అంశం. చారిత్రక వాతావరణ కల్పన అద్భుతంగా కనబడుతుంది. చారిత్రక పురుషులను మూర్తిమంతంగా చిత్రించడం బాపిరాజు నేర్పు. వారి నవలలన్నీ శిల్పము, సంగీతము, చిత్రలేఖనాది విషయముల కూర్పుతో పాఠకుని మనస్సులో రమణీయమైన అనుభూతిని కల్గిస్తాయి.

చలం నవల లన్నింటిలోకి చెప్పుకోదగ్గ నవల 'అరుణ' చిత్రలేఖనంలో 'Abstract Painting' అని ఒక మార్గం ఉంది. ఆ కోవకు చెందిన Abstract నవల అరుణ. నవలలో అరుణ ఒక స్త్రీకాదు. స్త్రీ గత సౌందర్య ప్రతీక. ఇతర పాత్రలు కూడ మానవుని లోని వివిధ మనస్తత్వాలకు ప్రతీకలు. రచన కూడ అదే పద్ధతిలో సాగింది. సాధారణ కథా కథనానికన్న విలక్షణమైన కథనం 'అరుణ'

అరుణ తరువాత పరిశీలించదగిన నవల బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' నవల మొత్తం పదకొండు అధ్యాయాలుగా విభజింపబడి ఒక్కొక్క అధ్యాయానికి ఒక్కొక్క పేరు పెట్టబడిఉంది. కడపటి అధ్యాయానికి పెట్టినపేరు 'చివరకు మిగిలేది! నవల సాయంసమయంలోదయానిధి కాలవగట్టున పడుకొని జీవితాన్ని గూర్చి ఆలోచిస్తున్నపుడు ప్రారంభమయి, ఉదయం దయానిధి కొండ ప్రక్కన మట్టిదిన్నె మీద పడుకొని అదే జీవితాన్ని గూర్చి ఆలోచిస్తున్నపుడు పూర్తవుతుంది. మొదట కాలవగట్టు మీద పడుకొన్నప్పుడు నిశ్చలమైన ఒక అనుభూతిని పొందిన దయానిధి కడకు ఇందిర మరణంతో అదే అనుభూతిని పొందుతాడు. ద్వంద్వాతీతుడవుతాడు. నిజానికి ఇక్కడితో నవల పూర్తవుతుంది. కానీ అక్కడి నుంచి దిగి వచ్చి మరల ప్రపంచంతో ఒక సమన్వయాన్ని సాధించు కొందామని ప్రయత్నించి నలిగిపోయి మరల జీవితమంటే ఏమిటి? అని ప్రశ్నించుకొని క్రొత్త జీవితాన్ని ప్రారంభించాలని అనుకోవడంతో నవల పూర్తవుతుంది. నవల ప్రశ్నతో మొదలయి అదే ప్రశ్నతోనే పూర్తవుతుంది. నవల ఎక్కడికక్కడ వలయాకృతిగా సాగుతూంటుంది. కడపట దయానిధి తనతో తాను సమాధానపడి ఒక సత్యాన్ని తెలుసుకుంటాడు. చివరకు మిగిలేదేమిటి అన్న ప్రశ్నకు సమాధానం కోసం చేసిన ప్రయత్నం, జ్ఞాపకాలు, దయానిధి జీవితంలో మిగిలిపోతాయి. కాని మానవుని జీవితం, ప్రయత్నం, ప్రయాణం ఇక్కడితో ఆగిపోదు. అంతవరకు తాను పొందిన అనుభవాల భూమిక నుంచి మరో క్రొత్త అన్వేషణ, మరో క్రొత్త జీవితం ప్రారంభమవుతుంది. ఎప్పుడో, ఎక్కడో దార్శనికమైన సత్యం అనుభవానికి వస్తుంది. అంతవరకూ అందరూ దయానిధులే, అందుకే నవలను ఎక్కడోఒకచోట ఆపాలి కాబట్టి మరలా ఆ ప్రశ్నతోనే ముగించడం జరిగింది. నవలలో భావ వ్యక్తీకరణ పద్ధతిలో నూత్నత్వముంది. భావనలో కవితాలక్షణం చోటుచేసుకుంది. నవలలో చైతన్య స్రవంతీ లక్షణమేకాక రచయితే నేరుగా చాలా భాగం కథను నడిపిస్తాడు. తెలుగు నవలల్లో, చివరకు మిగిలేది విచిత్ర ప్రయోగమే.

గోపీచంద్ నవలల్లో 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా', 'మెఱుపుల మరకలు', అసమర్థుని జీవయాత్ర—విలక్షణతను సాధించుకొన్న నవలలు 'మెఱు

పుల మరకల్లో' ఉషారాణి జీవితంలో విశృంఖల కామాన్ని అనుభవించి కడకు జీవితంలో తృప్తిని పొందలేక యోగినిగామారి హిమాలయాలకు వెళ్ళిపోతుంది. మొదటి నుంచి జీవితంలో జరిగిన సంఘటనలు, అనుభూతులు అన్నింటిని ఉషారాణి విశ్లేషించుకుంటూ కడకు ఆధ్యాత్మిక మార్గంలో వెలుగును అందుకొని వెళ్ళిపోతుంది. క్రమంగా ఆమె మానసిక ప్రవృత్తిలో వచ్చే మార్పు, తాను చేసిన తప్పుకు పొందే పశ్చాత్తాపము. విభిన్న భావ సంఘర్షణలు అన్నీ నవలా నిర్మాణంలో ఒకదాని నొకటి అల్లుకొని పోయాయి. పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా నవలలో కేశవమూర్తికూడ క్రమంగా, జీవితంలో తాను పొందిన అనుభవాలు, విచిత్ర స్వభావాన్ని సంతరించుకొన్న వ్యక్తుల సమిష్టితో కూడుకొన్న సంఘానికి తనకు మధ్య జరిగిన సంఘర్షణలు అన్నింటికి అతీతంగా ఒక ఆధ్యాత్మిక భూమిక నధి రోహిస్తాడు అందుకే అంతవరకు జీవితంలో జరిగిన ప్రతి చిన్న సంఘటనకు చలించి, ఆ మనసుతో తన్ను తాను మథనపడిన కేశవమూర్తి అరవిందా మాశ్రమానికి వెళ్ళి వచ్చిన తరువాత నిర్మలత్వాన్ని, స్థిరలక్షణాన్ని, ద్వంద్వాతీతమైన ఒక స్థితిని పొందుతాడు. నవలా నిర్మాణంలో వైచిత్రి కనబడుతుంది. జీవితంలోని ఒకే com Plese చుట్టూ పరిభ్రమిస్తూ చైతన్య స్రవంతీ లక్షణాన్ని కొంత వరకు సంతరించుకొన్న నవల అసమర్థుని జీవయాత్ర. సీతారామారావు దేన్నీ సాధించలేక, ఎవరితోనూ సమన్వయం పొందలేక, చివరకు ప్రపంచంపైన, కసిని, ద్వేషాన్ని వ్యక్తించేసి పతనమైనాడు. గోపీచంద్ పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా, మెఱుపుల మరకలతో పోల్చినపుడు, అసమర్థుని జీవయాత్రలో నిర్మాణగత లోపం స్పష్టంగా కనబడుతుంది. నవల మొత్తం సీతారామారావు ఆత్మన్యూనతా భావము, అసమర్థత చుట్టూ తిరగడంచేత పాఠకుని యొక్క విసుగుదలను తొలగించలేక పోయింది. అదీగాక రచయిత నవలలో మానవజీవితంలోని మరో పార్శ్వాన్ని చూపించలేక పోయాడు. రూపంలో వైచిత్రి ఉన్నా ప్రయోజన వైఫల్యాన్ని పొందిన నవల 'అసమర్థుని'. జీవయాత్ర.

ఉప్పల లక్ష్మణరావు 'అతడు-ఆమె' నవల తెలుగు నవలల్లో మరొక ప్రయోగం. డైరీల రూపంలో నవల మొత్తం సాగుతుంది. శాస్త్రి, శాంతం ఇద్దరూ డైరీలు వ్రాసుకున్నా అక్కడక్కడ సంభాషణ రూపంలోను, ఆత్మాశ్రయరీతిలోను సాగుతుంది. దినచర్యాత్మక రీతిలో నవల సాగడంచేత అక్కడక్కడ అనుస్యూతి దెబ్బతినడం, అతడు చెప్పిన విషయాలే ఆమె మరల మరో విధంగా చెప్పడం జరుగుతుంది. నవలలో పునరుక్తిదోషం అధికంగా ఉంది ఈ కారణంగా విసుగుదలను తొలగించలేక పోయింది. కేవలం దినచర్యాత్మక రీతిలో నవలను నడపటమే ఇక్కడ ప్రయోగం.

నోరినరసింహ శాస్త్రిగారి చారిత్రక నవలల్లో నిర్మాణ శిల్పం విశేషంగా ఉంటుంది. నోరి నరసింహశాస్త్రి తరువాత నిర్మాణ శిల్పంలో నూత్నత్వాన్ని తీసుక వచ్చిన వ్యక్తి రాచకొండ విశ్వనాథశాస్త్రి, వీరి అల్పజీవి, ప్రేమ-మనిషి, నవలలు నిర్మాణ గతంగాను, భావ విషయంగాను విశిష్టతను సాధించుకొన్న ప్రయోగాలు.

ఇటీవల కాలంలో నిర్మాణంలో నూత్నత్వాన్ని సంతరించుకొని రెండు విభిన్న సంస్కృతుల సంఘర్షణను చూపించిన నవల చివుకుల పురుషోత్తం రచించిన 'మూడో పురుషార్థం'. నవల ప్రారంభమే లండన్ నగరం నుంచి విమానం బయలుదేరి ఇండియా వైపు రావడంతో మొదలవుతుంది. నవలలో భారతీయవనితలైనా పాశ్చాత్య సంస్కృతీ వ్యామోహంలో తగుల్కొని జీవితాన్ని నరకం చేసుకొన్న 'సరస్వతి', పాశ్చాత్య వనితైనా భారతీయ సంస్కృతి, సంప్రదాయం పునాదిగా జీవితాన్ని సుఖమయం చేసుకొన్న 'రీటా, భారతీయ ఆధ్యాత్మికపు ముసుగులో విశృంఖల

కామ జీవితాన్ని ప్రబోధిస్తూ మానవుల జీవితాలను నాశనం చేస్తున్న గిరీష్ ఆటలు కట్టించి అతని సిద్ధాంతాన్ని ఖండించి అచ్చమైన భారతీయ ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రపంచానికి చాటిన రాఘవరాం—మొదలైన వాళ్ళు ఇందులోని పాత్రలు. నైతికత, ఆధ్యాత్మికత పునాది సూత్రాలుగాలేని సంస్కృతులు, సిద్ధాంతాలు కడకు ఎలా విఫలమై, మానవ జీవితాలను నాశనం చేస్తాయో సరస్వతి, పీటర్, గిరిష్, జీవితాలను ఉదాహరణగా చూపించాడు. నవలలో రచయిత చెప్పదలచుకున్న విషయాన్ని, నిరూపించదలచుకున్న సత్యాన్ని మొదటి నుంచి పోషించుకుంటూ వస్తాడు. దానికి పోషకంగా యోగశాస్త్రవిషయాలు, మంత్ర శాస్త్ర విషయాలను, అక్కడక్కడా వివరించాడు. అనేక సిద్ధాంతాలను, శాస్త్రవిషయాలను, ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులలోని అనేక విషయాలను చర్చారూపంలో ప్రవేశపెట్టి నవల కొక నిర్దిష్ట ప్రయోజనాన్ని సాధించాడు. ఈ నాలుగైదేళ్ళలో వచ్చిన నవలల్లో ఒక నిర్దిష్ట ప్రయోజనాన్నాశించి వచ్చిన నూత్న ప్రయోగం 'మూడో పురుషార్థం.

సాంఘిక నవలకు డిటెక్టివ్ నవలాశిల్పాన్ని అనుసంధానించి చేసిన రచన 'తులసీదళం' నవల చేతబడి, ఆధునిక వైద్య విధానం, హిప్నాటిజం-ఈ మూటియొక్క సంవిధానంతో పాఠకుని ఉత్కంఠను ప్రోదిచేసుకుంటూ సాగుతుంది. కాని రచయిత విషయవివరణలో పాఠకునియొక్క అనుభూతిని, పాఠకునిపై నవలయొక్క ప్రభావాన్ని గూర్చి అంతగా పట్టించుకున్నట్లు కనబడదు. భారతీయ సాహిత్య సంప్రదాయంలో భయభావానికి ప్రాధాన్యం లేదు. అది కేవలం 'అంగ'మేతప్ప 'అంగి' కాదు. అందుకే విశ్వనాథ 'బాణావతి' నవలలో భయభావాన్ని హాస్యంచేత విరిచివేస్తారు. ఈ కారణంగా పాఠకుని మనస్సు ప్రశమనస్థితిని పొందుతుంది. వస్తువుయొక్క ప్రయోజనాన్ని, దానికి మానవజీవితంలోని అనుభూతులకు ఎలాంటి సంబంధముందో, అవి మానవ జీవితాలపై ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో కూడ విచారించక నూత్నత్వాన్ని సాధించాలని, ప్రయోగం చేయాలని చేసిన రచన 'తులసీదళం'.

నూత్నంత్వంపేరిట, ప్రయోగంపేరిట ఈ మధ్య కాలంలో అనేక నవలలు వస్తున్నాయి. సాహిత్యపు విలువలను సంతరించుకొని, మానవునిలోని అనుభవలోకాలను ఆవిష్కరించేనవలలు ఎప్పుడోగానిరావటం లేదు. కాలప్రవాహంలో అప్పుడప్పుడు దేశకాలాల ఎల్లలను త్రెంచుకొని, అనుభవలోకాలను ఆవిష్కరించే నవల అంతవరకు వచ్చిన అన్నిరూపాలను తనలో నింపుకొని నూత్నరూపంతో సాక్షాత్కరిస్తుంది.

# అచ్చమైనకవి గుంటూరు శేషేంద్రశర్మ

—టి. శ్రీరంగస్వామి

సర్వచరాచరప్రపంచంలో ప్రతి అణువు తనకుగల ప్రాముఖ్యతని కనీసం కవిత్వంద్వారానైనఇవతల ప్రజలకి వ్యక్తం చేస్తాయి-కవిదృష్టినిబట్టి!! అని అనుకున్నప్పటికిని ఎంత మంది భావుకులు అణువు, పరమాణువులను ప్రతిబించింపగలగుతున్నారు.

"నేనెప్పుడు గొంతెత్తినా నా కోసంకాదు అయిదు కోట్ల కోసము కాదు, యాభైకోట్ల మంది కోసం గొంతెత్తుతున్నాను. నేను పడుతున్న బాధలే నాదేశమంతా పడుతోంది, నా మానవజాతి" అంతాపడుతోంది. కనుకనే నా జ్వాలిక నాదేశము నాలిక! అని, ఇదే నాదేశం, నా ప్రజలు అని చెప్పగలిగిన వాడుశేషేన్ (శేషేంద్రశర్మ) కవితలో.

ఈయన "నాదేశము, నాప్రజలు" ఆధునిక ఇతిహాసము గురించి భారతి ఫిబ్రవరి 1976 సంచికలో నాదేశము, నాప్రజలు వచన కవిత్వం కాదు. ప్రవచన కవిత్వం. దృక్పథములో, ఇతి వృత్తములో నిర్మాణ సౌష్టవంలో విలక్షణమైన నూత్న సృష్టి. ఈ కావ్యంతో తెలుగు కవిత్వం ఒక మలుపు తిరిగిందని చెప్పడం తొందర పాటు కాదనుకుంటాను. కృష్ణ పక్షం భావ కవితకూ, మహాప్రస్థానం అభ్యుదయ కవితకూ వేగు చుక్కలైనట్లే నాదేశం, నా ప్రజలు తెలుగుకవిత్వాన్ని క్రొత్తదారుల్లో నడిపిస్తుందని నాకు తోస్తుంది" అని విమర్శకులు వ్రాశారు.

వారి కవిత్వం గురించి శ్రీ వేలూరి శివరామశాస్త్రి, పుట్టపర్తి నారాయణా చార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, వేంకట పార్వతీశ్వర కవులు, గడియారం వేంకటశేష శాస్త్రి గారలు ప్రశంసించారు. ఈయన కవిత్వంను శ్రీశ్రీ గారు ప్రశంసిస్తూ ఇలా అన్నారు

"శేషేన్ శేషేన్ నీ పోయెమ్సు చూసేన్
పసందు చేసేన్ నీ ఋతుఘోషనీ
ఛందస్సుల రోషణీ మధుర మంజుల భాషనీ
ఇంద్రా ఇందిరా ఎంచక్కని విందురా
ఇంకెక్కడ కందురా భేషైనా తర్జుమా
తేలికైన కర్జుమా! నీది మంచి పద్యమా
లేక ఫ్రెంచి మద్య మా కవిరేవ విజానాతి
కవి దేవసుధాగీతి శ్రీనాథుడి క్రీడల్లో
అల్లసాని వాడల్లో కూడా దొరకని పదచిత్రం
విచిత్రం, కడు పవిత్రం
ధు మాగా ఉంది ఇమేజి
రమారమి కవుల సమాధి

and the translation is a magical transformation crystalline and prestine" అని.

ఈయన కవిత్వం కొందరికి కొరుకుడు పడలేక పోవచ్చు. కొంత మందికి అసలే అర్థం కాక పోవచ్చు కూడా. ఎవరిలో కవితా లక్షణమంటూ ఉంటే, ఏమి

వ్రాసినా, ఎట్లా వ్రాసినా చెల్లుతుంది. కవి కాని వాడు పద్యంలో రాసినా, వచనంలో రాసినాకవే. తను రాసిన దాంట్లో స్పృహ, సామాజిక తను దర్శింప చేస్తేచాలు. దానికితోడు అనుభూతి చక్కని కవిత్వంను చదివిన తృప్తినిస్తే చాలు అనుకున్నప్పుడు "కవిత్వమనే ఆనంద స్వరూపిణి ఏఒక్క రూపంలో ఎందుకుం టుంది! పద్యంలో ఉంటుందా, గద్యంలో ఉంటుందా లేక గేయంలో ఉంటుందా అని వెదకడం మాని అను భవైక వైద్యం చేసుకుంటే బాగుంటుంది.

"ఒక కన్నీటిక ఇమ్ముచాలు రస పూ
పూరోదార సాహిత్యముల్
ముకురింపంగ, ననేక కృత్రిమ సుమ
స్ఫూర్తిచ్ఛటా వాటికా
నికటాంతఃపుర జీవనస్థితులు
వర్ణింపంగ బొంగారునే
ఒక సాహిత్య రసప్రసారకణమే

నుత్పన్నమై యెన్నడున్". అని అనుకున్నప్పటి కిని ఆయన ఇలా అనగలిగినాడు

"పుస్తకమ్ములు చూడమ స్తకమ్ములు పోవు
జగతిజాడ చూడజాలరందు
మన చరిత్రలందు మహిమ యేమున్నది?
కనుడు చదువుడు మనుగడ చరిత్ర."
"చేతులన్నీ కలిపి సిద్ధమయినా మంచే
ఏడు సంద్రాలైనా ఈది పారేస్తాము
బ్రతికినా మనకొక్కటే అందులో
చితికినా మనకొక్కటే ..... "
"కలిమి జూచి నేను కట్టుబడ్డదిలేదు
బలిమిజూచి చెదిరి పారలేదు
చెలిమి నన్ను బట్టి సేవకునింజేయు
చిగురు గుత్తి నాదుచిత్త వృత్తి."

ఈయన కవిత "చెఱుకు విల్లు"లో కవి ఎలాటి వాడో చెప్పుతూనే, తన కవితలో తానే మార్గ దర్శ కుడై మన ముందు నిలుస్తాడు.

"అక్షరాల ఇసుకలో కవిత కడతారా మరి
తలపుల నెత్తావులు చిమ్మే మృదు హృదయ
సమధూళి కావాలి, జీవన మధూళితో తడపాలి
చెఱకు విల్లు విరిచిన వాడే చిగురుకైత చెపుతాడు
మొదల పొదరిళ్ళ మీద మల్లెలు విరి యిస్తాడు.

సుందర భావజగత్తు సృష్టించలేనివాడు
ముసలి పదాలలో మురిపే లాడుతూ సరిపుచ్చుతాడు
ఊహకు రెక్కలున్న వాడు ఉదధులు దాటుతాడు
ఉత్తుంగ శిఖరాల కెగురుతాడు.
వాడే చైతన్యం-చరిత్రను సృష్టిస్తాడు
చరిత్ర భారాన్ని జ్ఞాననేత్రాగ్నిజ్వాలా దగ్ధంచేస్తాడు

వాడే అజరః కవిః...." అందుకే శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు కవిత జీవన జ్యోతి, ఎన్నివీలైతే అన్ని జ్యోతులు వెలిగిద్దాం అని అన్నారు.

వ్యంగ్యంను మేళవించి, సున్నితంగా నేరుగా హృదయాలను రంజింప చేసే విధముగా "అనివార్యం" శీర్షికలో

"మూర్ఖుడు గడియారంలో
ముల్లు కదలనీకుంటే
ధరాగమన మంతటితో
తల క్రిందై పోతుందా."
"కుటిలాత్ముల కూటమి కొక
తృటికాలం జయమొస్తే
విశ్వసృష్టి పరిణామం
విచ్ఛిన్నం అవుతుందా" అని చెప్పారు.

"రాత్రి" నిద్రకోల్పోయి ఇళ్ళకప్పులమీద మొరుగు తోందని శేషేంద్రశర్మ గారు అనడం తోనే సరి పుచ్చుకోక ఆమొరుగుడుకు (భయంకరనిశీధికి)

వాటి గొంతులన్నీ ఆగిపోయాయి, కాని నాగొంతులేచి బంగారం విసిరేస్తోంది యువమానవపర్యాజ్వాలల్లోకి" అని అనడముతో అతని భావుకతను, క్రాంతిని అందించే నూతనోత్సాహాన్ని పాఠకుల మనస్సులపై ప్రసరింపచేస్తారు.

వాస్తవికతా ప్రపంచంలోని పరిధులను చూడమంటారు కాని ఆ నాస్తికతలోనే మునుగ కూడదని అంటూంటే. ఇలా "దేవుణ్ని గూర్చి దీర్ఘచర్చలు చేసేంతటి మూర్ఖులమూ కాదు, ధనికులమూ కాదు. మనవి పనిచేసి బ్రతకవలసిన చేతులు-జీవితం దుఃఖాన్ని రాసులు-రాసులుగా పోసుకొని అమ్ముతోంది మనదేశపు బజారుల్లో కాని, భూమిని ఫలాలుగా, పంటలుగామార్చే ప్రమాణత ఉన్నవాడు ధైర్యం కోల్పో నక్కరలేదు. మట్టిలో ఉన్న కస్తూరితీసే మనిషికి జీవనపరిమళాల కొరతలేదు." అని అంటూనే "వ్యవసాయ కూలీల ఆకాశం, వర్షాలే కురుస్తుందిగానీ వసంతాలు కురవదు" అని.

"కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది" అని చెప్పుకున్నప్పటికిని "బ్రతుక్కంటే బలవంతుడైనవాడే శబ్దంనుంచి శతాబ్దంవరకూ మలిచే శిల్పి అని ఆవిష్కరిస్తాను" "అంటూనే మానవ జీవితం ఒకపాశవిక ప్రదర్శనశాల అని మాత్రం నాకు తెలుసు-" అన్న ఈయన "మనం చరితలో ఏ అధ్యాయం ప్రవేశించామంటే చావునెదుర్కోడంకంటే, బ్రతుకునెదుర్కోడం పెద్ద సమస్య అయింది" అని చాటి చెప్పారు.

"తలవంచిన వాడికి నక్షత్రాలు కనపడవు, వాడి వక్షస్సు వృద్ధి పొందరు, వాడి మెదడులో ఎప్పటికీ సూర్యుడు ఉదయించడు" అనిగొర్రిల్లాతో మనకు సాక్షాత్కరింప చేస్తారు.

పక్షులు, శేషజ్యోత్స్న, ఋతుఘోషలలోని కవితా మధు స్రవంతిగా ప్రేమకూడా తపస్సే, నిద్రావస్థలో కంటే, సాఫల్యంతో దాన్ని తపస్సుగా, దర్శనంగా, ఆత్మసాక్షాత్కారంగా అనుభవించడం గొప్ప సంస్కార విశేషము. ఈయన ప్రేమ మీద చెప్పిన కవిత్వం గురించి ఈ వాక్యాలు చూస్తేచాలు.

"నిన్నూహించి రెండు ముక్కలు చెపితే
అనే రెండు రెక్కలు ఊహా
విహాయసంలో కెగిరిపోతుంది."

సౌందర్యోపాసనలో నుండి సామాజిక వికాసం కొరకు సామాజిక చైతన్యమును తట్టిలేపడానికి తను గాంచి, ఆ మానవతాప్రయత్నాన్ని "మండే సూర్యుడు" కావ్యంలో ప్రతిబింబించటానికి వేదికగా "శేష జ్యోత్స్న"లోనే నూతన తరాలు ఖండికలో ఇలా దర్శనమిస్తారు

"నీవు నమ్ముతావా నెచ్చెలీ ...
కాల చక్రం తిరిగి తిరిగి
జీవితాన్ని క్రాసుగా, మనిషిని క్రైస్తుగా
మలిచిన ఈ రోజు
ఒక నూతన యుగ సూర్యుడు ఉదయిస్తున్నాడు,
మనకు కానుక తెస్తున్నాడు
ఒక నూతనగీతను
విప్లవాన్ని వీరమరణాన్ని ఉద్ఘోషించే
ఉచ్చైస్స్వరగీతను" అని
"నేను చెమట బిందువుని
కండల కొండల్లో ఉదయించే లోక బంధువుని
గుండెలతో నాకుదోస్తీ,
నేనుండేది బాధలబస్తీ
సింధువంత చరిత్ర నా పిడికిట్లో ఉన్నా
చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని....." అని

"మండే సూర్యుడు"లో అంటారు.

ఈయన కవిత్వం చదువుతుంటే "అమరేంద్ర"గారు వీరిని గురించి అన్న ఈ మాటలు పదే పదే గుర్తుకు వస్తాయి. నేడు అభ్యుదయ కవిత్వం కింద చెలామణి అవుతున్న సిద్ధాంత ప్రాయమైన వాదాలేవీ వల్లించ

కుండా వాస్తవమైన అభినివేశంతో ఉగ్రరూతలూగే కవితా ఖండాలు నాకీ పుటలలో "కనిపించాయి" అని.

ఈయన కవిత్వంలో ఒక ప్రత్యేకత, ఒక కొత్తదనం, ఫుంత సాక్షాత్కరింప చేస్తాయి. పాఠకుడికి సహృదయుడికి.

శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారు 1927 అక్టోబరు 20న జన్మించారు. భౌతిక, రసాయనిక శాస్త్రాలతో బి. ఏ. పట్టాను గుంటూరులో పుచ్చుకున్నారు మద్రాసులో న్యాయశాస్త్రంచదివారు. 1951లో సొహ్రాబ్ అనే పద్యకావ్యం, 1958 ''మబ్బుల్లో దర్బారు" అనేవిప్లవ నాటిక, 1961లో హాస్యవ్యంగ్య శృంగార చదువులన్నీ కలిపి చంపూవినోదిని"గా 1963లో ''ఋతుఘోష," "విశ్వవివేచన," ''నరుడు-నక్షత్రాలు" 1965లో ''షోడశి", 1967లో ''స్వర్ణహంస", 1968లో ''విహ్వల" అనే కథలసంపుటి, ''సాహిత్యకౌముది", 1969లో ఊహలో పక్షులు, 1972లో శేషజ్యోత్స్న 1974లో ''మండేసూర్యుడు" 1974లో నాదేశం నా ప్రజలు రక్తరేఖ, 1976లో "నీరై పారిపోయింది, 1977లో "గొరిల్లా" కాక వారిసతీమణి సుప్రసిద్ధ ఆంగ్లకవయిత్రి ఇందిరాదేవి ధనరాజ్‌గిరిగారితో కలిసి ఆంగ్లంలో కొన్ని పుస్తకాలు ప్రచురించారు.

కవితా వ్యవసాయంలో కృషిచేస్తున్న ప్రతి ఒక్కరు, సాహితీపరులుగా వద్దామనుకుంటున్న ప్రతి యువసాహితీవేత్త తప్పకుండా శేషేంద్రకవిత్వం చదవాలి ఆయన మాటల్లో చెప్పాలంటే ఇలా చెప్పవచ్చు "నాకవిత్వం కేవలం మనిషికి డిఫెన్స్" అని

"పండుటాకులతరం పవనధాటికిపోయి
క్రొత్తచివురులువేసి కోకిలమ్మలు కూసి
నూతనంగా ఇలకు చేతనం వచ్చింది."

అన్నట్టుగా ఈయన కవిత్వం ప్రతిఒక్కరికి చేతనత్వం తెస్తుంది అని ఘంటాపథంగా చెప్పవచ్చును. అందుకే ఆయన అచ్చమైన తెలుగుకవి.

5-11-114/4
విద్యారణ్య పురి
వరంగల్లు
506009

# సాహిత్యగోష్ఠి

## ఆధునిక కవిత్వంలో ప్రతీక–దృక్పథ పరిణామం

ప్రతీక భాషకు నిసర్గమైన ధర్మం. ఈ వ్యాసంలో ఆధునిక తెలుగు సాహిత్య వికాసంలో 'ప్రతీక' ఎలా వాడుకోబడిందో చర్చించడం ప్రధానం. భావకవిత్వంతో వాస్తవికత కాల్పనికతతో ప్రవేశించి రచన 'భావప్రతీక' గా అవతరించింది. అభ్యుదయ కవిత్వంతో ఈ వాస్తవికతే లోకంలోంచి కావ్యంలోకి ప్రతిఫలించి ప్రజ్ఞాజనకమైన 'నాగరిక ప్రతీకగా రూపొందింది. అదే వాస్తవికత విప్లవ కవిత్వంలో జానపద జీవితంలోంచి స్ఫూర్తిని పొంది సరళీకృతమై 'విప్లవ ప్రతీక' గా మార్పుచెందింది.

భావకవిత్వంలో ప్రేయసి ప్రణయ దేవతగా భావించడంలో అలౌకికత్వం అపాదించబడింది. అంటే ఆ ప్రతీక భావ జగత్తులోంచి అవతరిస్తోందని అర్థం. అభ్యుదయ కవిత్వంలో 'మహాకదలిక (Great Move Ment)[1]' 'మహాప్రస్థానం' గా నాగరికత్వం సంతరించుకొంది, అంటే మేధో దశలోంచి ఉద్భవిస్తోందని అర్థం. విప్లవ కవిత్వంలో మేలుకొలుపు 'కొక్కొరొకో' గా సరళీకృతమై జానపదుల నిత్యజీవిత స్ఫూర్తినుంచీ పుడుతోంది.

భావ కవిత్వంలో ప్రతీక కవి అనుభూతిని పాఠకునికి అందించే సుందర ప్రతిరూపం అది పాఠకున్ని ఊహాగాంధర్వలోకాల్లో విహరింప జేసి లౌకిక జగత్తును మరపింప జేస్తుంది ఆవేదన, దుఃఖం మిళితమైనా వాడికి మూలమైన సమస్యలకు ఏకపక్షంగా భావకవి 'బాధలో' పరిష్కారాన్ని వెదుక్కున్నాడు వైయక్తిక భావనా స్వేచ్ఛతన చుట్టువున్న సమాజం నుంచి అందులోని కష్టనష్టాల్నించి భావ వైరుధ్యాల్నించి బయటపడి గిరిగీసుకొని బతికేటట్లు చేస్తోంది బయటి ప్రపంచాన్ని దుఃఖంలోనో సుఖంలోనో సౌందర్యంలోనో 'చంపేసి' ఏకాంత వ్యక్తిగా ఆ లౌకిక జగత్తులో 'బతికిస్తున్నది'. లోకంలోనున్న అన్యాయాన్ని, దుఃఖాల్ని కష్టాల్ని, నష్టాల్ని, అశ్లీలాన్ని ఆకతాయిని, రోగాల్ని హింసల్ని దోపిడీని, అజ్ఞానాన్ని దొంగతనాన్ని దౌరతనాన్ని వాటి అస్తిత్వం ఎరగనట్టు ఒంటికన్ను రాక్షసిలా పట్టాలు తప్పకుండా ప్రేమత్యాగం అనురాగం ఆత్మీయత, విశ్వమానవత, సౌందర్యం, స్వర్గం శృంగారం, అమలిన శృంగారం, దయదాక్షిణ్యం, గౌరవం, సాంప్రదాయాల మీద బ్రేకులు లేని బండిలా ఏకధాటిగా సాగిపోతూ వుంటుంది. కలల్ని పండిస్తూ నిజాల్ని దాచేస్తుంది– -నీతిని రక్షిస్తూ విలువలను దండిస్తుంది. కులాలను దులిపేస్తుంది, మతాలను కడిగేస్తుంది సౌందర్యాన్ని మరోలోకంలో నిలబెట్టి 'ప్రేమ' ను అందులో దేవతగా కొలుస్తుంది. విరహంలో చంపేసి చిరునవ్వులో బతికించి త్యాగంలో కులికిస్తుంది ఈ ధోరణి సమస్యలకు లోనయిన పాఠకుల్ని విసిగిస్తుంది ఇది చివరకు ఆదరణ పొందలేక పోయిందనడానికి కాలమే నిదర్శనం. చరిత్రే సాక్ష్య . దీనికి కారణం భావప్రతీక రసోత్పత్తికి–ఆనందానికి, కళ కళ కోసమే నన్న ధోరణిలో పడిపోవడం కవిత్వం ప్రయోజన కారిగాకుండా ఒక భోగవస్తువుగా పరిగణించడం కూడా.

అభ్యుదయ కవిత్వంలో ప్రతీక మేధాప్రపంచాన్ని గర్భీకరించుకొన్న ప్రజ్ఞాజన్య ప్రతిరూపం. అది అభివృద్ధి చెందుతూ వస్తున్న టెక్నాలజీ విప్లవం తెచ్చిన గుణాత్మకమైన మార్పును ప్రతిబింబిస్తోంది.1 కార్యకారణ దృక్ప

1. మహా ప్రస్థానానికి శ్రీ శ్రీ చెప్పిన అర్థం—చూ. "శ్రీ శ్రీ వ్యాసాలు
1 చూ "త్వ మేవాహం" —ఆరుద్ర

ధంతో ప్రతిదాన్ని ప్రశ్నించి ఆ వడపోతనుంచి నిలువ కల్గిన అది హీనమైనా, ఉన్నతమైనాదాన్ని కవితాబద్ధం చేయడం జరిగింది. అన్ని సమస్యలను శాస్త్రీయంగా పరిశీలించి వాటికి సశాస్త్రీయమైన విమోచనామార్గాన్ని గ్రహించడంవల్ల ప్రజ్ఞాజన్యమైన నాగరిక ప్రతీకగా రూపొందింది. దీనిలో భాగంగా పురాణేతిహాసాల విరుద్ధభావ ప్రబోధకత అభ్యుదయ బోధనకు విశ్యజననీతను కల్గించడానికి ఒక అపూర్వమైన మార్గం ప్రతి భావంతంగా ప్రవేశించింది.[2] పాత పిలువలను ప్రశ్నించి కొత్తవిలువలను ఏర్పరచి మరో ప్రపంచాన్ని కలలుగని శ్రమైక జీవన సౌందర్యాన్ని ప్రణవంగా ప్రాణంగా విశ్వసించింది. లోకాన్ని ఈ ప్రతీక ప్రతిఫలించడం వల్ల మంచి ఆదరాన్ని పొందింది. అంతేగాక రసోత్పత్తికి- ఆనందానికి–కాక చైతన్యానికి వుద్దేశింపబడి, కళ కళ కోసం కాదు సమాజం కోసం– కవిత్వం భోగవస్తువు కాదు– అన్న దృక్పధాన్ని కత్తి నిత్యజీవన స్రవంతిలో అతర్వాహినిగా నిర్వహింపబడాలి అన్న ధ్యేయం వుండటంవల్ల విద్యావంతులైన, 'శ్రోతల్ని' ఆకర్షించింది. జనసామాన్యం దీన్ని ఆదరించలేక పోయారు. కారణం అది భావాత్మక ప్రధాన ధర్మంగల imagintion నుంచి నాగరిక జీవితంలో పెరిగిన ప్రతీక కాబట్టి అంతేగాక మేధావి వర్గం సృష్టించిన 'ప్రతీక' కాబట్టి.

ఇదేగతి దిగంబర కవితకీ పట్టింది. దానిలోని మైక్రోస్కోపిక్ ప్రతీక జానపదుల నాడిని పట్టుకున్నది కాదు.

విప్లవకవిత్వంలో సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితికి నిర్వీర్యమైపోయిన జనసామాన్యాన్ని విప్లవించడానికి శాస్త్రీయమైన విముక్తి మార్గాన్ని నేపధ్యంగా కల్గినా సులభంగా సూటిగా స్పష్టంగా తెలియజెప్పే జానపదుల నిత్య జీవితం నుంచీ స్ఫూర్తిని పొందిన 'నిరాడంబర జానపద ప్రతీక' సృజింపబడినది. ఛందః కవిత్వం లాగానే వచన కవిత్వం మాటు మనిగిపోవడానికీ, ఈనాడు మళ్ళీ జానపదుల పాటల అలవరసలు ప్రచారం పొందటానికి కారణం జానపదగీతంలో రసాత్మకత ప్రధమ ధర్మం. అంటే జానపదుల మాట, చేత భిన్నంగా వుండవని అర్థం. ఈ లక్షణాన్నే విప్లవ ప్రతీక చాలావరకు సంతరించుకొంటోంది.[1]

ఆంధ్రభారతి
శ్రీ కృష్ణ దేవరాయ విశ్వకళా పరిషత్
అనంతపురం

# ఆవంత్స వారి కవితా జ్యోతి

"కవిత్వం ఎందుకు రాస్తావని అడిగితే ఏం చెప్పను?"

అని పరితపిస్తారు చంద్రజ్యోతి కావ్యకర్తలైన శ్రీ ఆవంత్స శశికాంత శాతకర్ణిగారు.

నిజమే! ఏ కవినైనా ఆ ప్రశ్న వేస్తే ఆశ్చర్యజనకంగానే ఉంటుంది.

అమషిని ఎందుకు ఆహ్వానిస్తాం?

పక్షులు గూళ్ళను వదలి స్వేచ్ఛగా ఆకాశంలోకి ఎందుకు ఎగిరివెళ్తాయి?

సరస్సులలోని కమలాలు సూర్యరశ్మి సోకగానే ఎందుకు వికసిస్తాయి?

మామిడి చెట్టుమీదెక్కిన కోయిల ఎందుకు గొంతెత్తి పాడుతుంది?

ఇవన్నీ ప్రశ్నలు- కాదు– ప్రశ్నలపరంపరకదూ!
మరి వీటికి సమాధాన మొచ్చినపుడు, కవికూడా కవిత్వం ఎందుకొఅకు వ్రాస్తున్నాడో సమాధాన మిస్తాడు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కవిత్వావిర్భావపు వేళల్లో పెక్కుమంది యువకులు ఎలుగెత్తి కవితాగానం చేసారు, అటువంటి సాహితీ సంస్కారం కలిగిన యువకవుల్లో శ్రీ ఆవంత్స సోమసుందర్ గారు అగ్ర

ఇలా పరిణమించినవే.

గణ్యులు. వారి కుమారులే నేటి మన 'చంద్రజ్యోతి' కావ్య కర్తలైన శ్రీ ఆవంత్స శశికాంత శాతకర్ణిగారు

'చంద్రజ్యోతి' కావ్యఖండికలలో కవిప్రాచ్య ప్రాశ్చాత్య కవుల సాహితీ సంస్కారంతో- తాను తెచ్చుకొనిన గొప్ప భావుకతను అన్వయించుకొని దానితో ఒక విలక్షణమైన శైలిని వినిర్మించుకొని రచనలను గావించిన ఒక విశిష్టమైన సాహితీ వ్యక్తిత్వం గోచరిస్తుంది. ప్రధానంగా వీరి కవితా దృక్పథం మానవత్వంతో కూడుసమాజ శ్రేయస్సు— సమాజాభ్యుదయం వీటిని పడికట్టు రాళ్ళుగా స్వీకరించి కావ్యాన్ని వ్రాసినట్టుగా తోస్తుంది. ఏకవియైనా తమ కావ్యం లోకశ్రేయస్సు కొఅకే రాస్తారు. కీర్తికాంక్ష ఇక రెండో పక్షంగా చెప్పుకోవచ్చు. సమకాలీన సమాజాన్ని ప్రతిబింబించగలిగింది సాహిత్యం ఒకటే. (Literature is that which represents the Contemporary Society) అటువంటి సమకాలీన సాహిత్యాన్ని నేటి యువకవులందరు సృష్టిస్తున్నారు. అటువంటి వారిలో చెప్పుకొన దగిన మంచికవి శ్రీశాతకర్ణిగారు. వారు వెలయించినకావ్యమే చంద్రజ్యోతి!

చంద్రజ్యోతి కావ్యాన్నిస్థూలంగా పరిశీలించినప్పుడు మనకు నాలుగు అంశాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. ఒకటి నేటి విషమ సమాజాన్ని గురించి వ్రాసినకవితలు, రెండు తుఫాను భీభత్సాన్ని గురించి వ్రాసిన కవితలు, కవిసామాజిక స్పృహను, ఆశయాలనూ, ఆకాంక్షలనూ అభివ్యక్తీకరించే కవితలు - వైయక్తికమైన విశేషానుభూతులను రూపకల్పన చేసినకవితలు ప్రధానంగా పేర్కొనదగ్గవి. ప్రస్తుతకావ్యంలో ముప్పైతొమ్మిది కవితలుఉన్నాయి. ఇందులోకొన్ని అభ్యుదయపరంగాను, కొన్ని భావుకతతోను, కొన్ని సామాజిక సందేశాలను ఇచ్చే రీతిలోను, మరికొన్ని ఆంగ్ల సాహితీసంపర్క ప్రభావంతోను నిండుకొనిఉన్నాయి. అందులో నేటివిషమ సమాజాన్ని ఉద్దేశించిరాసిన కవితలలో సౌమ్యజ్యోత్స్న నైమిశారణ్యంలో, గడ్డకట్టిన కన్నీళ్ళుపరేరంభం, నరాలలో క్రోధానలం, జీరో అవర్! మొదలగునవి. అందులో 'గడ్డ కట్టిన కన్నీళ్ళు' అనేకవితలో నేటిసామాన్య మానవునిజీవితాన్ని గురించి ఈవిధంగా విశ్లేషిస్తారు కవి—

దిన పత్రిక లోని పతాక శీర్షికలా
ప్రస్ఫుటంగాలేదు నేటిజీవితం
ఎక్కడో మారు మూల నక్కి
ఏకొద్ది మంది నిశితమైన చూపులకో గాని దొరకని
అసమర్థుని మరణవార్తలా అప్రాముఖ్యంగా వుంది

నిజమే! సామాన్యమానవుడి జీవితం ఎంతో దుర్భరంగా ఉంది. కడుపునిండా పట్టెడు మెతుకులు భోంచేసే మనిషి ఇక కానరాడు. నిత్యంఏవో సమస్యలతో, బాధలతో కష్టాలతో జీవితభారాన్ని మోస్తూ, సగం వంగిపోయిన నడుంతో బ్రతకలేని సామాన్యుడు మనకళ్ళ ముందు నిత్యం సాక్షాత్కరిస్తాడు. అందులకే అతని జీవితం దినపత్రికలోని పతాకశీర్షికలా ఉండటానికి వీల్లేదు. మారుమూలగా నక్కి జీవితాన్ని వెళ్ళబుచ్చే ఒక అసమర్థుని జీవితం లాగా తోస్తుంది. తప్పదు! కవి గావించిన ఉపమానం ఇక్కడ ఎంతో ప్రశంసనీయంగా ఉంది. ఆ కవితలోనే మరొక చోట సామాన్య మానవుని పరంగా కవి—

'సాంప్రదాయ కవులు వర్ణించే మాధుమాసం
ఆనంద వసంతోదయం
సంతోషవనప్రియుల కలకూజితం
ఈ జీవితంలో ఎప్పటికైై దర్శనమిస్తుంది?!.

—అని ప్రశ్నిస్తారు. నిజమే! కవికి కూడా గొప్ప సందేహంగానే ఉంది. మరి కవి కూడా అందరిలాగే ఒక సామాన్య మానవుడే కదా! సామాన్యుడు ఎన్నడూ ఆశలు పెంచుకోడు! పెంచుకోలేడు! కాని భవిష్యత్తులో తనకేదో మేలు జరుగుతుందని ఆశిస్తాడు! ఆశపడ్తాడు! గొంతెమ్మ కొరికలు కోరుకోడు! Man 'leads by hope' అన్న ఒక ఆంగ్ల సూక్తిమనం ఈ సందర్భంగా గుర్తుచేసుకోవచ్చు!

అదే విధంగా 'సౌమ్యజ్యోత్స్న' అనే కవితలో ఒక చోట—

"నేటి అర్ధరాత్రి సరిగా పన్నెండు గంటలకు
నాకుడి చెయ్యి ఎడమ చేతితో కలహిస్తుంది
కింది పెదవి పైపెదవిని సంహరిస్తుంది
ఎడమకన్ను కుడికంటిని పొడిచేస్తుంది
ఇంకా ఏం ఉగాది సోదరా మనకు?
ఈ దేశాకాశంపై సౌమ్య జ్యోత్స్నలెక్కడ?
సౌమనస్య సౌహార్ద్ర సౌజన్యం ఏ దిక్కున?

—అని ఉద్వేగంతో ప్రశ్నిస్తారు కవి శ్రీ శాతకర్ణి 'బలవంతుడిదే రాజ్యం' అన్ననీతి సూత్రానికి ఇక్కడ చక్కని వ్యాఖ్యానం చేయొచ్చు' నాకుడి చేయి ఎడమ కన్ను కుడికంటిని పొడిచేస్తుంది అనే వాక్యాలను బట్టి మనకు ఒక విస్పష్టమైన అర్థం గోచరిస్తుంది. అదేమిటంటే ఒక మానవుడు తోటి మానవుని శ్రేయస్సు కొరకు- అతని వినాశనాన్ని కాంక్షిస్తున్నాడు. అందుకే బలవంతునిదే రాజ్యం అన్నట్టుగా—అసామెతకు ఇక్కడ ఎంతో బలముంది ఒక మనిషికి తోటిమనిషి బలవంతుడై శత్రువుగా మారుతున్నాడు. ఇది నూటికి నూరుపాళ్ళు నిజం!

'చంద్రజ్యోతి' కావ్యంలో చెప్పుకొనదగిన మూడవ అంశం' సామాజికస్పృహను దష్టిలో పెట్టుకొని- కవి తన ఆశయాననో ఆకాంక్షలన్నో అభివ్యక్తం చేసేరచనలు, ఇవి మరి కొన్నిఉన్నాయి. అందులో నవజీవన మధురసూక్త 'అనేఖండికలో కవి ఇలా అంటారు.

సూర్యుడి తొలికిరణాలు తాకగానే ఆహ్లాదంగా విచ్చికొనే
దినకమలాల్లా నాకళ్ళు మెరుస్తాయి
నామనస్సెప్పుడూ ఆనంద దృశ్యాలనే నేస్తుంది
జీవరసాలం నుండి ప్రేమఫలాలను తెంపుకుంటుంది
పువ్వులు తమ మధువును బొట్టు బొట్టుగా అవిరిచేసి
గాలిని పరిమళభరితం చేయడం కంటుంది
సూర్యోదయం కాగానే పక్షి ఆనందంతో వేసే వెర్రికేక
నాతోనవజీవనో త్సాహం నింపుతుంది
రాత్రినేకన్నకలలు మంచులా కరిగి జీవజలంగా
దినం ఊటబావిలోంచి పైకెగజిమ్ముతాయి.
నేడు నేను రాసిన కవిత రేపటి ఉదయంగా విచ్చుకుంటుంది
నాకవితల కండ బలంతో మనుష్యులు నడిచే దారిలోని
నిరాసలను బండరాళ్ళను తొలగిస్తాను

ఈఖండికను చదివి నప్పుడు కవిలోని భావుకత ఎ పాటిదో మనకు సువిదిత మవుతుంది. ఇక్కడ నాకళ్ళు దినకమలాల్లామెరుస్తాయి అనడంలో గొప్ప భావుకత ఉంది కమలానికి సూర్యుడికి ఎంతో అనుబంధముంది. సూర్యుడు ఉదయించుయిచడంతో కమలం విచ్చుకుంటుంది. చీకట్లను చీల్చుకుని వచ్చేపగలు సూర్యోదయం ప్రారంభ మౌతుంది దీనిని కవిభావుకతను ప్రతీకగా తీసుకోచ్చు నాకవితల కండ బలంతో మనుష్యులు నడిచే దారిలోని నిరాశ.

బండరాళ్ళను తొలగిస్తాను' అనడంలో కవిగొప్ప ఆశావాదిగా గోచరిస్తాడు ప్రతికవీ తనరచనలద్వారా లోకాన్ని సంస్కరించ డానికి ప్రయత్నిస్తాడు. లోక సంస్కరణ ఒక్కటే అతని ధ్యేయం కాదు, అతని కవితాలక్ష్యంలో అది ఒకభాగం మాత్రమే. నింగి ఎత్తుకుఎదిగినలేపటి మానవుడు జ్ఞానకరవాలంతోకాలం పన్నేకుయుక్తులను చిన్నాభిన్నంగా నరుకుతాడుకాశయుక్తినినవజీవనమధురసూక్తిగామలుస్తాడు అని పలకడంలో కవిగొప్పఆశావాదిగాగానేకాక సమాజాన్ని సంస్కరిస్తాడు. మిగిలిన కవితలన్నీ ఒక ఎత్తు; ఒక నవజీవనమధురసూక్తి ఒక్కటి ఒకఎత్తు. ఇక కావ్యంలో పేర్కొనదగిన నాలుగో అంశం: వైయక్తికమైన విశేషాను భూతులకు రూపకల్పనగావించినటువంటి రచనలు కొన్ని ఉన్నాయి. వానిలో కవితాచంద్రశాల' మహాగాయకుని అంతర్థానం వంటివి ముఖ్యంగా పేర్కొనదగ్గవి' 'కవితాచంద్రశాల, అనేఖండికలో ఇలా అంటారోకచోట —

మెలకువ కొరడాకొసల బాధ్యతల నిదాఘాల లోంచి కలల
శీతల మందిరాలకే మొరసే గుండెల పదధ్వనుల తొందర!
ఈస్వప్న కావ్యాంతర సంగీతంరమణీయ దలహాసధవళాంబరం
అమని కలల విరిసోచెట్ల నిశ్శబ్ద తపస్సును భంగపరచే పచ్చ పచ్చని
చీరల అప్సరసలెందరో తెలుపుమాయని నీబాల్య స్మృతులు
అదక్కడే అక్కడే నిరీక్షిస్తున్నాయి నీకోసం
ఆస్వప్న సౌధంలోనే ఆ అవిరళ మాధుర్యంలోనై"

ఈ వాక్యాలలో గొప్ప అనుభూతి ఉంది. అర్థ ఉంది. సమాజాన్ని సంస్కరిచాలనే తపనఉంది. ఇక్కడ కొన్ని వాక్యాలను మనం చదువుతూంటే మధురకవి' బాల గంగాధరతిలక్ సృష్టించిన గొప్పకావ్యం అమృతంకురిసిన రాత్రిలోని కొన్నిఖండికలు గుర్తు కొస్తాయి. తప్పదు కవి శ్రీశాతకర్ణిగారు వాటిని అనుకరించారని కాదుగాని, వాటి ఛాయలు ఇందులో ఉన్నట్టు కనిపించినన్నూ, ఇవి తమంత తాము చెప్పు కొనదగిన స్వతంత్రమైన ఖండికలే!

అన్నింటికన్న కవిభావుకత. వ్యక్తిత్వాన్ని విప్పిచెప్ప గలిగిన ఒకే ఒక కవిత చంద్రజ్యోతి చందన పరిమళం ఈకావ్యంలోని ఖండికలలో ఇది చిట్టచివరది, విశిష్టమమై మిక్కిలి విలక్షణమైనది కూడా! ఈఖండికలో కవిశ్రీశాతకర్ణిగారు చిట్టచివరగా తనకావ్యరచనోద్దేశ్యాన్ని గురించి లోకానికి విస్పష్టంగా చాటి చేప్తారాయన!

"మూసిన కనురెప్పలే రాత్రి
తెరచిన నీకళ్ళు పదళ్ళు
నీతీయటి సంభాషణలో
వేయి రాగాలు- కోటిగీతాలు
నీమాటలు— ఉషోదయవేళ
చెట్లమీది ఆకుపచ్చటి తెరల వెనుక
నిన్నుతల్చు కోగానే నాకు శ్వాసనిచ్చేగాలి
తనలో లీనం చేసుకున్న మాటలకు
కవితాకృతి కల్పిస్తుంది.
నీ స్మరణతో నాబాల్యం
ఆకుపచ్చని వనాల నుండి నడచి వస్తుంది.
వెన్నెలదివ్వెగా వర్తిస్తుంది
అప్పుడు నాస్మృతుల సుందరభావాలతో
నా కావ్యకలశాన్ని నింపుతా :
మానవ దేవతలకందరికి అమృతాన్ని పంచుతా !"

— కావ్యరచన అందరూ చేసేపనేగానీ, కావ్యరచన ద్వారాలోకానికి అమృతాన్ని పంచిపెట్టడమనేది కొందరు చేసేపని. ఆకార్యాన్ని నెరవేర్చాలనుకొన్న శ్రీశాతకర్ణిగారు తమ చంద్రజ్యోతి ద్వారా ధన్యులైనారు.

చంద్రజ్యోతి కావ్యం గురించి బహుధా ప్రశంసించి దాని యోగ్యతను లోకానికి తెలియపరచడంలో తగిన శ్రద్ధాశక్తులను చూపిన డాక్టర్ పురి పండ అప్పలస్వామి గారును. ఆచార్య రోణంకి అప్పల స్వామి గారును తమ విలువైన ఆశీర్వచనాన్ని ఒక వచనగేయంలో పొంచుపరచి కావ్యానికి అందచేసిన డాక్టర్ సింగిరెడ్డి నారామణ రెడ్డి గారును అభినందనీయులు! వారు చెప్పడం చేతనేమి కావ్యం చదివి తరువాత తెలుసుకొన్నదైతేనేమీ, ఒక్క విషయం మాత్రం విస్పష్టంగా గోచరిస్తుంది. అదేమిటంటే కవిమీద ఆంగ్ల కవుల ప్రభావాలు సుప్రసిద్ధ ఆంగ్లకవులైన సెసిల్ డెలాయి, స్టీఫెన్ స్పెండర్. వాల్టేర్ డిలామేర్ వంటి ప్రముఖుల సాహితీ వ్యక్తిత్వాలు ఈ కవినివిశేషంగా ప్రభావితం గావించాయి. ఆచార్య రోణంకి వారి మాటల్లో చెప్పాలంటె కవి శాతకర్ణిగారి గురించి —

"శాతకర్ణి కవి మనస్సు
సూర్యోదయంనండి సూర్యాస్తమయందాకా
పారవశ్యంతో పులకరించే హవిస్సు"

— అనీ చెప్పొచ్చు ఇది నూటికి నూరు పాళ్ళనిజం ! ఆధునిక తెలుగు సాహిత్యంలో వచన కవితకు నాంది పలికిన ఘనత శ్రీశ్రీ వంటి ప్రామాణికులైన యుగకర్తలకు దక్కితే ఆప్రక్రియలో విశేషంగా కృషిచేసి పెంపొందించి వృద్ధి గావించిన ఘనత కుందుర్తి, తిలక్ వంటి కవులకు దక్కుతుంది. ఇటీవల ప్రచురణ యోగ్యతను పొంది వెలుగులోనికి వచ్చిన మినీకవితా సపుంటాలు, కోకొల్లలు. కానీ వానితో నాలుగు కాలాలపాటు నిలబడగలిగినవి కొద్ది మాత్రమే. ఈ రాకెట్ యుగంలో, సాహిత్యాభిమానులును విస్తృతంగా కృషిచేసే వారి సంఖ్యా మెండుగా ఉంటే ఈ రోజుల్లో తనది అంటూ ఒక కవితా ముద్రతో లోకంలో నిలబడగలిగిన స్వచ్ఛమైన యువకవి శ్రీ శశి కాంత శాతకర్ణిగారు.

దూర్జటి వెంకట బాలాజి
తెలుగు లెక్చరర్
కావలి




## తమిళ సాహిత్యం-
## భారతి కవిత

రచన-డా॥ చల్లా రాధాకృష్ణశర్మ
ప్రచురణ-యువభారతి
వెల రూ. 3/- సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

ఆంధ్రప్రదేశ్ రాజధానిలో వెలసిన సాహిత్య సాంస్కృతిక సంస్థలలో యువభారతి పేరెన్నిక గన్నది. ఉదాత్తమైన ఆశయంతో, ఉన్నతలక్ష్యంతో వివిధ సాహిత్యప్రక్రియల్లో అనేక గ్రంథాలను ప్రచురిస్తూ తెలుగు వాఙ్మయజగత్తులో క్రొత్తవెలుగులను ప్రసరింపజేస్తున్నది. హిందీ, కన్నడం మొదలైన ఇతరభాషా సాహిత్యాన్నికూడా తెలుగువారికి అందజేస్తూవిందుకూర్చుస్తున్నది యువభారతి

ద్రావిడభాషలలో ప్రాచీనమైన తమిళంలో ఉత్తమ సాహిత్యసృష్టి జరుగుతూవస్తున్నది. ఆంగ్లసామ్రాజ్యం భారతదేశంలో స్థిరపడిన తరువాత ఆంగ్లభాషా సాహిత్యప్రభావంవల్ల దేశంలోని అన్నిభాషలలోవలెనే తమిళంలోకూడా నూతన సాహిత్యసృష్టి జరిగింది. తమిళ సాహితీజగత్తులో కొత్తదారివేసింది సుబ్రహ్మణ్యభారతి. ఆయన దేశకాలభక్తుడు. మానవతా స్వాతంత్ర్యప్రియుడు. వివిధప్రక్రియలలో రచనలుచేసి భారతి తమిళభారతిని నూతన భూషణాలతో అలంకరించాడు. దేశాభిమానాన్ని, స్వేచ్ఛాప్రియతనూ,మానవతావాదాన్నీ తనరచనల్లో ప్రకటిస్తూ తమిళజనతలో నూతనజ్యోతిని వెలిగించాడు. భారతిరచనలు దేశవిదేశ భాషల్లో అనువదింపబడి సహృదయులను ఉత్తేజపరచాయి.

ఈలాంటి మహాకవికవితను డా. చల్లారాధాకృష్ణ శర్మగారు చక్కగా సరళరీతిలో తెలుగులోనికి అనువదించారు. రాధాకృష్ణశర్మగారు తెలుగు తమిళభాషలలో గొప్పపండితులు. రచయిత. కవి. కనుక అనువాదం ఎంతోఇంపుగా సాగింది

"భారతదేశం బహు ప్రాచీనం"
పాడెదమెప్పుడు దీని ప్రశస్తిని"

అంటూ భారతిభూమిని భక్తితో ప్రస్తుతించాడు

"ఎన్నెన్నో జాతులుమనలో ఉండేను
ఏమది న్యాయం ఇతరులజోక్యం ?
ఒకతల్లిపిల్లలు కలహించుకున్నా
అన్నదమ్ములనే వారెన్నటికీ.
కలిసికట్టుగ ఉంచేమనముండేము
సఖ్యతలోపిస్తే అవమానం మిగిలేను"

అని భారతి జాతీయసమైక్యతను గొంతెత్తిగానం చేశాడు. భారతదేశం వర్ధిల్లాలనీ భారతాభ్యుదయాన్ని కాంక్షించాడు భారతి. పరతులకీ, పులయలకీ, మరవ

లకీ, కరవలకీ అందరికీ స్వాతంత్ర్య రావాలనీ గీతం పాడాడు. అంతేకాదు దాస్యవిముక్తమైన రష్యాను ప్రశంసించాడు.

శర్మగారు భారతికవితలను అనువదించడమేగాక తమిళసాహిత్య చరిత్రను సంగ్రహంగా తెలిపారు ప్రతికవితకు ప్రారంభంలో చిన్న ఉపోద్ఘాతాలను కూర్చారు భారతికవితను సుందరశైలిలో అందించిన రాధాకృష్ణ శర్మగారు, ప్రకటించిన యువభారతి వారు మిక్కిలి అభినందనీయులు.

-వేముగంటి

## శ్రీశ్రీకవితా వైభవం

డా॥ మిరియాల రామకృష్ణ
ప్రచురణ: యువభారతి
5. కింగ్స్ వే, సికింద్రాబాద్
పుటలు: 72 సైజు డెమ్మి
వెల: 5 రూపాయలు.

మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ కవితపై పరిశోధన చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పట్టా సంపాదించారు. శ్రీశ్రీ కవితల్లో 63 కవితల్ని ఎంచుకొని వాటికి సురుచిర వ్యాఖ్యానాన్ని రామకృష్ణ గారు సమకూర్చగా యువభారతి వారు ప్రచురించిన ఈ పుస్తకం నేటితరం కవులంతా చదివి తీరాలి.

దాదాపు 1930 నుండి ఆంధ్రసాహిత్యం ఆయిన (శ్రీశ్రీ) వెంట నడుస్తోంది. అయన పాట, ఆయన మాట, ఆయన ప్రక్రియ, అయన ప్రబోధం యువతరానికి విప్లవశంఖారావం వినిపించింది. కార్మికకల్యాణానికి, శ్రామిక శ్రేయస్సుకు విశ్వజనీన విజయ మార్గాన్ని చూపించింది.

శ్రీశ్రీ పాట కవోష్ణ రుధిరజ్వాల! శ్రీశ్రీవచనకవిత ఉత్తేజాన్ని, ఊపిరిగా పీల్చే వజ్రాయుధ ధార! శ్రీశ్రీ వచనరచన గుండెను గుప్పిట పట్టిన గద్య ప్రహేళిక! శ్రీశ్రీ నాటిక సూటిగా మాట్లాడే జీవితపేటిక! శ్రీశ్రీ కథ జీవనవ్యథను మోసుకొని వచ్చే ఉదధి తరంగం. శ్రీశ్రీ సినీకవిత జీవితక్షీరాన్ని పొంగించే జ్వాలానవత శ్రీశ్రీ ఆర్తి అభ్యుదయం, శ్రీశ్రీ విక్రాంతి విప్లవం! అని "వికసించిన విద్యుత్తేజం"లో జి. వి. సుబ్రహ్మణ్యం గారు అంటున్నారు.

తెలుగుభాష మీద శ్రీశ్రీకి ఉన్న అధికారం కారణంగా, "అనితర సాధ్యం నా మార్గం" అనడం జరిగింది.

ఈ చిన్నిపుస్తకంలో రామకృష్ణ గారు కవితల్ని ఎంతో జాగ్రత్తగా ఎన్నుకోవడాన్ని గమనిస్తాము.

శ్రీశ్రీ కవితామూర్తిని పూర్తిగా సాక్షాత్కరింప చేయడానికి రచయిత కృషి చేశారు.

తన 15 వ ఏట రచించిన విశ్వరూప సందర్శనము ఖండికతో ప్రారంభించి కాలక్రమంలో కవితల్ని పొందుపరచి, శ్రీశ్రీలో వచ్చిన మార్పును స్పష్టంగా చిత్రీకరించడానికి రచయిత అపూర్వప్రయత్నం చేశారు.

తన 16 వ ఏట "ధైర్యము త్యజించి ఘోర యుద్ధంబు సేయ/ ననుచిత పలాయన పథంబు ననుసరంచి/ ఓ సుయోధన! యెందేగి యుంటి విపుడు/ రమ్ము! క్షత్రియోచిత సంగరంబొనర్ప" అని సమరాహ్వానము (1926లో)పల్కిన శ్రీశ్రీ 1970లో "ఊరుకుంటానా నేను కసిగా కసాయిగా ఉపద్రవంలాగ ఉవ్వెత్తుగా లేచి సంహారాన్ని స్పందనం చేసి ఉద్రేక తరంగాలె తురంగాలుగా ఆగ్రహం కొరగాని చెబూని సాయుధ విప్లవ బీభత్సుని సారథినై భారత కురుక్షేత్రంలో నవయుగ భగవద్గీతా ఝంఝూని ప్రసరిస్తాను" అన్నాడు.

ఈ రెండు ఉదాహరణల మధ్యకాలంలో శ్రీశ్రీ కలం నుండి వెలువడిన కవిత్వాన్ని సమీక్షించడానికి రచయిత ఈ పుస్తకంలో శ్లాఘనీయమైన కృషిచేశారు

శార్దూల వృత్తం, తేటగీతలు, చంపకమాల, ముత్యాలసరాలు, మంజరీ ద్విపద మొదలైన సర్కసు ఫీట్లు అభ్యాసం చేసిన శ్రీ శ్రీ గురించి తెలియక నేటి కవి కుమారులు చతికిల బడుతున్నారు.

మహితభవదీయ రూప సంపద్విలాస నిర్మలాంచిత మందాకినీ తరంగ సమనగాహనో పారిజాత "విమల పుణ్య మహిమ కారణ గళిత కల్మషుడనైతి" అని బహువ్రీహీ సమాసంతో తేటగీతి వ్రాసిన శ్రీ శ్రీ ఛందో బందో బస్తులన్నీ/ ఛట్ ఫట్ ఫట్ మని త్రెంచి/ Damn it! ఏమిటా ఇదంటే/ Pray! it's అందాం?" అన్నా శ్రీశ్రీ ఛందో బంధాల నెక్కడా త్రెంచనేలేదు. చెప్పిన మాట చేయక పోవడం కూడా అధి వాస్తవికతే అని విడమర్చి చెప్పారు రచయిత.

మృత్యు ప్రబోధము (1928)లో శాబ్దిక మృదంగం ద్వారా మృత్యుభీతిని కళ్లకు కట్టించడం, ప్రభా సమేత, ఘోషానవీన వంటి ప్రయోగాల్లో స్త్రీలింగ శబ్దాల మీద అభిమానం చూపి భావకవుల దారి త్రొక్కడం; "నీవు నాటిన తోటలోపల/ చేవ తరుగని పూవు గుత్తులు/ నేటి పరకను తేట వలపులు/ నింపెడిని దెసల" అనే ముత్యాల సరంలో తత్సమ శబ్దం లేకుండా యతిప్రాసల స్వేచ్ఛతో గతి వైచిత్రిని సాధిస్తూ పెద్దన కవితా శిల్పానికి ఉబ్బితబ్బిబ్బయిన శ్రీశ్రీ కవితాంజలి సమర్పించడం; "కవీ! నీగళ గళన్మంగళ/ కళా కాహళ హళాహళిలో/ కలసిపోతని! కానవాకే కదలిపోతిని" అనే కవిత ద్వారా శబ్దనాద సుందరమూ శబ్ద సంఘటనా వైచిత్రీ మధురమూ అయిన స్విన్‌బర్న్ కవిత్వం చదివి గాఢంగా ప్రభావితుడు కావడమూ, అదే విధంగా శాబ్దిక ధ్వనితో తాదాత్మ్యం అనుభవించి శబ్దశిల్పి అయిన స్విన్‌బర్న్‌ను శబ్ద శిల్పంలో ప్రాసక్రీడలతో లయ విన్యాసంతో ఛందో నైపుణ్యంతో స్తుతించడాన్నీ రచయిత రామకృష్ణ చక్కగా ఎత్తి చూపారు. ఈ సందర్భంలోనే స్విన్‌బర్న్ శబ్ద క్రీడలను మించాడు శ్రీ శ్రీ అనేందుకు నిదర్శనం మీ అద్వైతం గేయం అంటున్నారు, రచయిత.

లాస్యతృష్ణ అనే ఖండికలో జ, శ్వ, మి, మ, జీ వంటి అక్షరాలు అందెమోతను చవి చూపిస్తున్నాయి. ఈ సమాసంలో జగదీశ్వర శబ్దాన్ని తొలగించి పరమేశ్వర శబ్దం పెడితే గణభంగం కలగకపోయినా సొంపు చెడుతుంది. ఏ పదం మార్పు సహించదో అది అనేక విధాల "సమర్థమైన" పదం అంటూ మహాప్రస్థానం ప్రసక్తి తీసుకువచ్చి రచయిత "మహాప్రస్థానం గీతాలలో ఏ ఒక్క పదమూ శబ్దమూ పరివృత్తిని సహించక పోవడానికి వెనుక శ్రీశ్రీ చేసిన సాధన ఇలాంటిదే?" అని చెపుతూ 'అరణ్యమున హరీంద్ర గర్జన' కుబదులు 'అడవి లోపల సింహం అపూ' అనిమారిస్తే ఎంత పేలవంగా మారిపోతుందో గమనించమని పాఠకుల్ని కోరుతూ మహాప్రస్థానంలో కూర్పు శ్రీశ్రీ ప్రత్యేకతగా సోదాహరణంగా చూపించారు.

వ్యావహారిక భాషలోని జీవశక్తిని ఆవిష్కరించి, ఆధునిక కవితానికి సాహిత్యాన్ని సన్నిహితం చేయడమే కాకుండా భాషా జీవశక్తిని చైతన్యానికి శ్రీశ్రీ ప్రతీకతంగా వాడు కోవడాన్ని 'భిక్షు వర్షీయసి'లో శ్రీశ్రీ భాష ఆబాల గోపాలానికీ, అర్థం అయినా సిద్ధాంత అవగాహన ఉంటేకాని భావం అర్థం కాదన్నారు.

కవితా ఓకవితా అనే వచనగీతంలో శ్మశానాల వంటి నిఘంటువులు దాటి, వ్యాకరణాల సంకెళ్లువిడిచి, ఛందస్సుల సర్పరిష్వంగం వదలి" కవితారచనలో తీసుకొన్న స్వతంత్రానికి మూలాన్ని పరిశీలించాడు. సంప్రదాయ పరిజ్ఞానం, చొరవ, ప్రయోగకౌశలం, అభ్యాసపరిణతి మొదలైన అర్హతలన్నీ ఉండడంవల్లనే తన కవిత్వాన్ని నూతన నిఘంటువుకీ, నూతన వ్యాకరణానికీ, నూతన ఛందస్సుకీ లక్ష్యం అయ్యేటట్లు చేశాడు శ్రీశ్రీ అని రచయిత వ్యాఖ్యానం. మనస్సినీ

వాలి, నాదబ్రహ్మపు పరిచుంబన, ఇలా తలంలో హేమంపిండగ మొదలైన మాటలను నూతనార్థాలలో వాడాడు వెలువడినై, వెళిపోయింది, నీవేపే నూత్న ప్రయోగాలతో వ్యాకరణం సంకెళ్లు తెంచడం శ్రీశ్రీకే సాధ్యంఅయాయి. మహాప్రస్థానంగీతాల్ని ఛందస్సు నుండి లయకుకాకుండా లయనుండి ఛందస్సుకుసాగిన ప్రస్థానాలుగా వర్ణించారు.

'అనర్గళం, అనితర సాధ్యనామార్గం అని శ్రీశ్రీ 'ఐ'లో చెప్పుకోవడాన్ని కొంతమంది ఆక్షేపించవచ్చు. అందులో కవిత్వం ద్వారా విప్లవం కోరేశ్రీశ్రీవంటివారి తనమార్గం అనితరసాధ్యం అను కోవడం సరికాదుఅంటూ శ్రీశ్రీకి ఉన్న ప్రతిభా వ్యుత్పత్తి అభ్యాసాలు వాల్మీకినుండి తనదాకా అను స్రూతంగా వస్తున్నవాటి వారసత్వంవల్ల పదును దేలి నవే శ్రీశ్రీకవిత్వం పెక్కుమార్గాల సమ్మేళనంవల్ల రూపొందిన స్వతంత్రమార్గం! అందుకే అనితరసాధ్యం అని సమర్థించారు రామకృష్ణ.

ఏవిశ్వవిద్యాలయమూ గిఉుగువారికి ఇవ్వలేని బిరుదును శ్రీశ్రీఎలా ఇచ్చాడో, కేటలాగు కవిత్వంలో కన్పించే కవిత వెనుకఎంత ఆలోచనఉందో, 'కాకి కేమితెలుసు సైకోఎనాలిసిస్' అనే కవితలో శ్రీశ్రీఅధి వాస్తవిక ప్రయోగాల్ని ఏవిధంగా సాగించాడో ఎత్తి చూపడం జరిగింది ఈపుస్తకంలో.

అనుశాసనానికి పద్యాన్నిమటుకు పూర్తిచేసి అసం పూర్తిగా వదిలేసిన సామ్యవాద భారతంలోని నాదాలకు కవిత్వంగా మెరుగుపెట్టడంలో శ్రీశ్రీ నైపుణ్యాన్ని మెచ్చుకొన్నారు.

బస్తాలకు బళ్లకెత్తు, పద్యాలా కవిత్వం? ప్రాచీ నత సవిత్రమూ, పనికిరాదా నవత్వం? ప్రపంచాన్ని చూడలేని కవితనిజం చూపదు. ఇసకలోన తలదూర్చిన ఉష్ట్రపక్షిచూపదు.

అంటూరాశిన, దీర్ఘకవితల్ని, లక్షణాన్ని వ్యతిరే కించిన శ్రీశ్రీ వాసిని, ప్రయోగాన్ని అభిమానిస్తూ సైన్స్ఆఫ్ హ్యూమర్ అనేతల్లివేరు జీవిత మృత్తిక నుండి చైతన్యపోషక పదార్థాలను అనుక్షణమూ తన కవిత్వానికి అందిస్తూ ఉంటుందని శ్రీశ్రీ చెప్పాడు.

మళ్లీ ఝుంఝు.

"ఈ వ్యవస్థను మార్చాలని ఉద్ఘోషించడం కన్నా ఇంకోఉత్కృష్టధర్మం ఏసాహిత్య పరుడికైనా ఎలా ఉంటుందో నేనూహించలేను. మరి ఈవ్యవస్థకి రక రకాలుగా కొమ్ముకాచేరాతగాళ్లంతా నాదృష్టిలో ప్రజా ద్రోహులే" అంటూ శ్రీశ్రీనిజాయితీతో ప్రకటించాడు.

—హరినారాయణ్

# వార్తావాహిని

## విశ్రాంతి నెరుగని కార్యకర్త బి. వెంకటరామారావు గారు

అక్టోబరు 20 సాయంకాలము హైదరాబాదు నగర కేంద్ర కార్యాలయములో నగరసారస్వతజ్యోతి మిత్ర మండలివారిచే తోటపల్లిగాంధీ అనిన్యవహరించబడు సారస్వతజ్యోతి మిత్రమండలి అధ్యక్షులు, ఆంధ్ర ప్రదేశ్ సర్వోదయమండలి కార్యదర్శి శ్రీబోయినపల్లి వేంకటరామారావుగారికి ఘనమైన సన్మానము జరుప బడినది రాష్ట్ర రెవిన్యూశాఖామంత్రి గౌ॥ పి మహేంద్రనాద్‌గారి అధ్యక్షతన జరిగిన ఈ సన్మాన సభలో రాష్ట్రభూదానయజ్ఞ మండలి చైర్మెన్ శ్రీ సి వి. చారి, రాష్ట్ర సర్వోదయమండలి అధ్యక్షులు శ్రీ జి. మాణిక్యరావు శ్రీ కె. వైద్యనాధన్ రాష్ట్రగ్రంధాలయ సంఘాధ్యక్షులు శ్రీ కోదాటి నారాయణరావు కేంద్ర ప్రభుత్వ స్వతంత్ర సమరయోధుల సంక్షేమ సలహాదారుడు శ్రీ పింగళి తిరుమలరావు దివ్యజ్ఞాన సమాజ ప్రముఖులు గడ్డంసన్యాసిరావు, మానవసేవా సమితి కార్యదర్శి శ్రీ శ్రీరపు అప్పారావు ప్రభృతులు శ్రీ బోయినపల్లి వేంకటరామారావు స్వాతంత్ర్య సమరయోధుడుగ సంఘ సేవకుడుగ, సాహిత్య సేవకుడుగ ఒక అర్ధశతాబ్దముపుండి ఆయన చేస్తున్న ప్రశంసనీయమైన సేవను ఆయన కార్యదీక్షను గూర్చి కొనియాడుతు ప్రశంసించారు.

మొదట మంగళవాయిద్యములతో, వేదపఠనముతో కుంభాహ్వానముతో స్వాగతమిస్తూ వేదికపైకి తీసుకు వెళ్లినతరువాత బాలికల ప్రార్ధనాంతరం నగర సారస్వతజ్యోతి మిత్రమండలి ఉపాధ్యక్షులు శ్రీ యన్. సత్యనారాయణశాస్త్రి సన్మానపత్రం సమర్పించి స్వాగతం పలికినారు. మండలికార్యదర్శి శ్రీచెలమచర్ల గోపాలకృష్ణమాచార్యులు శ్రీబోయినపల్లి వారికి దుశ్శాలువ సమర్పించగ కోశాధికారి శ్రీ ఐ. యన్. ఆర్ ఆచార్యగారు గజలక్ష్మి చెక్కబడిన మెమోంటోను బహూకరిస్తూ సన్మానించారు. శ్రీ యన్. సత్యనారాయణశాస్త్రి సంస్కృతములో తామురచించిన ప్రశంసా పద్యములను చదువగ, ప్రజాకవి శ్రీమంచాల రాజేశ్వర తెలుగు కవితను గానంచేశారు.

సన్మాన సమితిచే ప్రచురింపబడిన శ్రీబోయినపల్లి వేంకటరామారావు అభినందన సంచికను రెవిన్యూశాఖామాత్యులు శ్రీ పి. మహేంద్రనాధ్ ఆవిష్కరించారు. "విశ్వ" శ్రీ ఇమ్మడోజు భద్రయ్య రచించిన "విశ్వగురు నాటికలు" అను గ్రంధమును శ్రీ బోయినపల్లికి అంకితమివ్వబడెను. గ్రంధమును ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి కార్యదర్శి శ్రీ డాక్టరు ఇరివెంటి కృష్ణమూర్తి గారు ఆవిష్కరించుచు కృతికర్తను, కృతిభర్తను అభినందించుచు ఆ గ్రంధమును సంక్షిప్తముగా సమీక్షించుచు ప్రశంసించిరి. కృతిభర్త కృతికర్తకు నటరాజ మెమొంటోను సమర్పించి ఖద్దరుశాలువతో సత్కరించిరి. మండలిపక్షమున శ్రీ పోతుకూచి సాంబశివరావుగారుకూడా కృతికర్తను నూతన వస్త్రములతో సన్మానిస్తూ నగర కేంద్ర మండలులు చేస్తున్న కృషిని ప్రశంసిస్తూ శ్రీ వేంకటరామారావు చేస్తున్న సేవలను త్యాగమును గూర్చి కొనియాడిరి.

సభకు అధ్యక్షత వహించిన రెవిన్యూశాఖామాత్యులు శ్రీ పి. మహేంద్రనాధ్‌గారు ప్రసంగిస్తూ దాదాపు నలుబది సంవత్సరములనుండి అనుభవం గడించి ప్రజాసేవకు అంకితమైన మహనీయుడని అన్నారు. వక్తలందరూ వారివారి రంగములో శ్రీ వేంకటరామారావుగారితో పనిచేసిన అనుభవములను గూర్చి వివరించారు.

ఐ. యన్. ఆర్. ఆచార్యగారి వందనసమర్పణతో కార్యక్రమం విజయవంతంగా ముగిసింది.

— —o——

# దక్షిణభారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాద్

## స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్ష

క్రిందతెలిపిన హిందీపండితులు 300మంది కంటె ఎక్కువవారికి హిందీ నేర్పి ప్రథమ హిందీ పరిచయ పరీక్షలో కూర్చొన బెట్టి ఆంధ్ర సభ పక్షాన సన్మానింపబడు చున్నందుకు స్వర్ణోత్సవ సమితి తరపున వారిని అభినందిస్తున్నాము.

1. శ్రీమతి కె. అన్నపూర్ణమ్మ గారు
   హిందీ పండితులు
   36/1 ఫోర్ట్, కర్నూల్-518001.
2. శ్రీమతి వి॥ భాగ్యలక్ష్మిగారు
   హిందీ పండితులు
   C/. వి. రామారావుగారు
   వైద్యనాథ అయ్యర్ రోడ్డు
   ఫోర్ట్, కర్నూలు-518001
3. శ్రీ అల్లంకి కోటి సాంబశివరావుగారు
   హిందీ పండితులు
   కప్పగంతుల వారి వీధి
   రామచంద్రరావుపేట, ఏలూరు-2.

వేమూరి రాధాకృష్ణమూర్తి
కార్యదర్శి
స్వర్ణోత్సవ సమితి

హైదరాబాదు
ది. 15-11-1983

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.